సాంమానసే ధ్యాయసే 68. గీతవిద్యానుయోగాతితృష్ణేన కృష్ణేన సంపూజ్యసే 69. విశ్వ
హృద్యేన గద్యేన పద్యేన విద్యాధరైర్గీయసే, 70. యక్షగంధర్వసిద్ధాంగనామండలైర్మండితే
71. సర్వసౌభాగ్యవాంఛావతీభిర్వధూభిస్సురాణాం సమారాధ్యసే 72. సర్వవిద్యా
విశేషాన్వితం చాటుగాథాసముచ్చారణాకంఠ మూల్లోలసద్వర్ణరేఖాన్వితం కోమలంశ్యా
మలోదారపక్షద్వయం తుండశోభాతిదూరీభవత్కింశుకాభం శుకం లాలయంతీ మిషక్రీ
డసే 73 పాణిపద్మద్వయేనాపరేణాక్షమాలాగుణం స్ఫాటికం జ్ఞానసారాత్మకం పుస్త

---

68. గీతవిద్యానుయోగాతితృష్ణేన= గానవిద్యానుబంధమునం దనివి చెందని, కృష్ణేన= కృష్ణుని చేత, సంపూజ్యసే= బాగుగఁ బూజింపంబడియెదవు.

69. విద్యాధరైః = విద్యాధరులచేత, విశ్వహృద్యేన= ప్రపంచమునకు మనోజ్ఞమగు, గద్యేన= గద్యముచేతను, పద్యేన= శ్లోకముచేతను, గీయసే= గానము సేయఁబడియెదవు.

70 యక్షగంధర్వసిద్ధాంగనామండలైః= యక్షులయు గంధర్వులయు సిద్ధులయు ముగుదలగుంపులచే, మండితే = అలంకరింపబడినదానా!

71 సర్వసౌభాగ్యవాంఛావతీభిః= సర్వవిధసౌభాగ్యంబుం గోరు, సురాణాం వధూభిః= దేవకామినులచే, సమారాధ్యసే= పూజింపంబడియెదవు,

72. సర్వవిద్యావిశేషాన్వితం= ఎల్లవిద్యావిశేషములతోఁ గూడినదియు, చాటుగాథాసముచ్చారణాకంఠం= చమత్కారపద్యములుచ్చరించుకంఠంబుగలదియు, మూల్లోలసద్వర్ణరేఖాన్వితం= విశేషించినమంచిరంగులు దేలురేఖలతో నొప్పునదియు, కోమలం= అందమయినదియు, శ్యామలోదారపక్షద్వయం = శ్యామలవర్ణముగలగొప్ప రెక్కలజంటగలదియు, తుండశోభాతిదూరీభవత్= ముక్కుయొక్క మెఱుంగునకు దూరంబగుచున్న, కింశుకాభం= మోదుగుమొగ్గలసిగ్గు గలదియు నగు, శుకం= చిలుకను, లాలయంతీ మిష= బుజ్జగించునదివోలె, క్రీడసే= విహరించెదవు.

73. అపరేణ= మఱియొక, పాణిపద్మద్వయేన= కేలుందమ్మిదోయిట, స్ఫాటికం= స్ఫటికమణి నిర్మితమయిన, అక్షమాలాగుణం= జపమాలికసరమును, జ్ఞానసారాత్మకం= జ్ఞానసారమయమగు, పుస్తకం= పుస్తకమును, బిభ్రతీ= తాల్చుచున్నదిగా, యేన= ఎవ్వనిచే, సంచింత్యసే = చక్కఁగఁ జింతింపంబడియెదవో! తస్య= అట్లుధ్యానము సేయువానియొక్క, వక్త్రాంతరాత్= వదనమునుండి, గద్యపద్యాత్మికా= గద్యపద్యస్వరూపిణియగు, భారతీ= సరస్వతి, నిస్సరేత్= వెడలును. వీణియ నొకకేలను శుకంబు నొకకేలను మఱియొకకేలుందోయిట స్ఫటికాక్షమాలయుఁ బుస్తకంబును దాల్చియుండునట్లు భావించినవాఁడు మహాకవియగు నని భావము,

కం విభ్రతీ యేన సంచింత్యసే తస్య వక్త్రాంతరా ద్గద్యపద్యాత్మికా భారతీ నిస్సరేత్ 74, త్వ య్యనాత్వం సనాథాకృతిర్భావ్యసే సోపి లక్ష్మీసహస్రైః పరిక్రీడతే. 75. కిం న సిద్ధ్యేద్వపుః శ్యామలం కోమలం చారుచంద్రావచూడాన్వితం ధ్యాయతః 76 స్తస్య లీలాసరో వారిధి 77 స్తస్య కేళీవనం నందనం 78 తస్య భద్రాసనం భూతలం 79 తస్య గీర్దేవతా కింకరీ. 80 తస్య వాచాకరీ శ్రీస్స్వయం. 81, సర్వయంత్రాత్మికే 82. సర్వమంత్రాత్మికే 83. సర్వముద్రాత్మికే 84 సర్వశక్త్యాత్మికే 85. సర్వవర్ణాత్మికే 86. సర్వరూపే 87. జగన్మాతృకే

---

74 త్వం=నీవు, యేనవా=ఎవ్వరిచేనేని, సనాథాకృతిః = పెనిమిటితోఁ గూడినయాకారముగలదానవుగా, భావ్యసే=చింతింపంబడితివో! సోపి=అట్లుధ్యానించువాఁడును, లక్ష్మీసహస్రైః=వేనవేలలక్ష్మీదేవీజనముతో, క్రీడతే=క్రీడించును. పెనిమిటితోఁగూడిన యాదేవిని భావించినవాఁడు విష్ణుపదవిని బొందునని భావము.

75. శ్యామలం=చిలుకవంటి పచ్చవన్నెగలదియును, కోమలం=మనోహరమును, చారుచంద్రావచూడాన్వితం=మనోహరుఁడగు చందమామను శిరోభూషణముగఁ దాల్చినదియునగు, వపుః=ఆకారమును, ధ్యాయతః=ధ్యానమొనరించువానికి, కింనసిద్ధ్యేత్=ఏది సిద్ధింపదు.

76. తస్య=అట్లుధ్యానించెడువానికి, వారిధిః=సముద్రము, లీలాసరః=క్రీడాసరస్సగును.

77. తస్య=అతనికి, నందనం=నందనవనము, కేళీవనం = క్రీడోద్యానమగును.

78. తస్య=అతనికి, భూతలం=భూస్థలి, భద్రాసనం=భద్రపీఠమగును.

79. తస్య=అతనికి, గీర్దేవతా=సరస్వతి, కింకరీ=దాసురాలగును.

80. తస్య=అతనికి, శ్రీః=లక్ష్మి, స్వయం=తాను, వాచాకరీ=పలుకుబంటగును.

81. సర్వయంత్రాత్మికే=సకలయంత్రస్వరూపిణీ !

82 సర్వమంత్రాత్మికే=సకలమంత్రస్వరూపిణీ !

83. సర్వముద్రాత్మికే=సకలముద్రాస్వరూపిణీ !

84. సర్వశక్త్యాత్మికే=సమస్తశక్తిస్వరూపిణీ !

85. సర్వవర్ణాత్మికే=సమస్తవర్ణస్వరూపిణీ !

86 సర్వరూపే=సకలస్వరూపిణీ !

87. జగన్మాతృకే=లోకములకుందల్లియగుదానా !

88. హేజగన్మాతృకే 89. పాహిమాం 90. పాహిమాం 91. పాహిమాం 92. పాహి.

అని స్తుతించి భక్త్యవనతుండై నిలువంబడియెను.

కాళి. కడుసంతసంబుతో,,

వత్స కళాచంద్ర! నీయొనర్చినసంస్తవంబున కతులామోదంబుం జెందితిని. భవదీయ కవితారసవిశేషంబునకు మానసంబున నలరి మహాకవి యనుబిరుదనామం బొసంగితిని. మదనుగ్రహంబున నిట్టివిశేషంబు నీ కబ్బినందుకు నిదర్శకంబుగ నీ విది మొదలు కాళిదాసుండనునామంబు వహింపుము. నీవు కావ్యనాటకాలంకారాదుల నుద్ధరింప భూమి నుండవతరించినభారతీదేవివి గాని సామాన్యమనుష్యమాత్రుండవు గావు. ధారాపతి యగుభోజభూపతి భవదీయకవితాసారసర్వస్వం బెఱింగి యపరిమితధనంబు లొసంగుచు నిన్నుం గారవించు. మఱియు భవదీయసుకవితాచాతురికి మెచ్చి పెక్కండ్రు దేశాధిపతు లగణితంబు లగుధనసంచయంబులు సమర్పింపఁగలరు. కాన నిర్విచారుండవై రాజ్యతంత్రంబు నొప్పరికించి యిప్పుడు కలికాలవినష్టం బయియున్న గీర్వాణభాష నుద్ధరింపుము. సుకవితా యద్యస్తి రాజ్యేన కిం,, అన్నట్లు సుకవితానిర్వర్తితజీవనోపాయంబుకన్న వృష్టాంశవృత్తికి బానిసయై యుండుట సుఖావహంబు గామి నీ వందులకు నియ్యకొనకుము. నీవు జాతిస్మరుండవై విస్మయనీయంబు లగు పెక్కులు కార్యంబులు జరుపం బోయెదవు. ఇంకను నీయాపేక్షితం బేమ్యా? నీవడిగిన వెల్ల నొసంగం గడంగియున్న దానను. మదనుగ్రహంబు వడసినవానికి సర్వంబు సిద్ధించు.

కాళిదాసుఁడు. ఓలోకైకజనని! ఇంతకంటె నాకుం గావలసిన దే మున్నది? అయిన నొక్కటి యడిగెద.

చం. అనుకల మీవు నన్ను సదయాత్మతఁ జూచుచు వైరిసంఘముల్,
పనుపడి చేయు నెగ్గులను భవ్యగతిం దొలఁగించి కాచుచున్,
నిను మది నెంచునప్పు డతినిర్భరసత్కరుణాత్మమూర్తివై,
కనఁబడుచు న్సమస్తనరకాంతనతాంఘ్రినిఁ జేయుచుండుమీ !

---

88. హేజగన్మాతృకే=సర్వప్రపంచోత్పత్తికిం గారణరూపమగుప్రకృతిస్వరూపిణీ

89. మాం=నన్ను, పాహి=కావుము.

90. ,, ,,

91. ,, ,,

92. పాహి=కావుము.

కాళి. వత్స ! కాళిదాస నీప్రార్థనంబు నంగీకరించితిని. భవదభీష్టార్థంబు సమకూర్ప నప్పుడప్పుడు నీకుం గన్పడుచుందును. భక్తజనాపేక్షితప్రదానంబుకన్న నాకుం బ్రియంబు లేదు. సుఖంబున నుండుము.

అని యంతర్హిత యగునట్లు నిష్క్రాంత యగును.

మదనసేన. కరముసంతసించుచు,,

ప్రాణనాథ ! ఈదేవికి నీయందుఁ గలకరుణాతిరేకంబు కడు సంస్తవనీయంబు. ఇట్టి నిన్నుం బతిఁగాఁ బడసిననాయదృష్టంబె పొగడికొనం దగి యున్నది.

చం. అభినవమన్మథుం డనుచు నంగన లెల్లను మెచ్చురూపమున్,
విభవసముజ్జ్వలం బయినవిశ్రుతియుం దగునాభిజాత్యమున్,
సుభగతమోజ్ఞమై గృపయు శుద్ధయశోవిభవంబు నింద్రస,
న్నిభ మగుసంపదల్వెలయనిన్ను నలంతులు గాని పొందఁగన్.

ఏను నాతొల్లిపుట్టువునం జేసినపుణ్యం బెట్టిదియో ! ఇట్టిసుకవికులావతంసంబుం జేపట్టఁ గలిగితిని. మఱియు నీవు సరస్వతీనవావతారుండ వగుటకు సందియంబు లేదు. కానిని మంత్రోపదేశమాత్రంబునన దేవి సాక్షాత్కరించి వరంబు లొసంగునే! అదియునుం గాక యిట్టిరసాస్పదం బగుసుకుమారార్థపదబంధురం బయినవచనరచనాచాతురి మనుష్యమాత్రుల కుండునే !

చం. అరుణకరప్రసారవికచాంబుజషండనికాయనిర్గళ,
ద్వరమకరందబిందుఝరవైఖరిచారుపదావళీమనో,
హర మయి యొప్పునీకవిత నాస వినంగ సుధాబ్ధివీచికల్,
పరుసగఁ బైఁబయిం బరవి వచ్చువిధంబునఁ దోఁచె నాత్మకున్.

ప్రాణనాథ ! చిరకాలసంప్రార్థితం బగుచున్నమన్మనోరథంబు నాయర్చించుచుండిన కులదేవతయనుగ్రహంబున నిప్పుడు ఫలియించె.

కాళిదాసుండు. మహాహర్షంబుతో,,

ఓచంచలలోచనాతిలకమా ! వినుము,

చం. సురగరుడోరగప్రముఖశోభనగాత్రు లకందరానియా,
నిరుపమరూపసంపదల నివ్వటిలంగలనిన్ను మన్ననన్,
నరభువనాంబుజాలయను నర్మిలిఁ బెండిలియైతి నింక న,
చ్చెరు వగుజన్మభవ్యఫలసిద్ధి లభించెను నాకు నెచ్చెలీ.

నేపథ్యంబున వైతాళికుండు,,

చం. చెలువపుదీవి యా మదనసేనను జెందితి మహోన్నతిన్,
తెలఁగుచుఁ గాళికావరముచేత మహాకవి వైతి వింగనీ,
కులము పవిత్ర మయ్యె సతికోరిక యును ఫలియించె నిప్పుడీ,
జలజసఖుండు దోఁచుతటి చక్కనఁ దగ్గెను మేలుకోఁ గదే!

వెండియు నేపథ్యంబున యుండు వైతాళికుండు,,

చం. అమలిన మైన నీ యళము దంతటఁ బర్వఁగఁ జూచి వల్లెనే,
యమునకలను గ్రహించు చెవు దంబుజవైరియుఁ గ్రుంకుచున్న వాఁ,
డపరవధూనగంసకుసుమాభరణస్థితిగాత్రిఁ జూడుమం,
భగిమ మిపు డొప్పుచున్న! కుంభకాముని గొల్వఁగ మేలుకోఁగదే!

కాళిదాసుండు. ఓ ప్రాణేశ్వరీ! దేవీసాక్షాత్కారాదిశుభపరంపరలఁ గాలంబు గడచుట యెఱుంగ మైతిమి. ఇప్పుడు తెలవ యయ్యె! నేను కాళోపాసకుండనై యుండునప్పుడు గర్భానుష్ఠానంబు నేయక మానుకొన్నందునం బ్రాయశ్చిత్తంబు చేసికొని విశుద్ధిం బొరయవలసియున్నది. ఈనగరోపకంఠంబునం గలపుణ్యనదికిం జని యచట స్నానంబు సల్పి ప్రాయశ్చిత్తంబు చేసికొని సూర్యోపస్థానాదులు దీర్చి వైళంబ వచ్చెద. మద్విరహంబున నీవు ఖిన్నతం జెందకుము.

మదనసేన. కాళిదాసునిం గౌఁగిలించుకొని,,

చం. నిను విడఁబాసి యొక్క త్రుటి నీరజనాయకమార్గణాళికిన్,
మనమున నోర్వఁ జాల నిఁక మానవలోకసుధామయాంశు ని,
న్ననుఁ గొనకుంటి నేనిఁ ద్రుటికాలము కల్పశతంబు గాఁ దగున్,
ఘనశుభకీర్తి రమ్ము వెస కాల్యసుకృత్యము దీర్చి యానతోన్.

మఱియు నిప్పుడు,,

చం. నిను విడఁబాయఁ బోవఁ గడు నిర్భరమైన వియోగవేదనన్,
మనము మహాంధకారమున మగ్నతఁ జెందినరీతిఁ గాంచ ను,
త్తను విడ గ్రాఁగ సాగ నొకకష్టము దుర్భర మైన దిప్పుడే,
మును కొని కల్గఁ బోవు నని యున్నను దోఁచుచున్న దాత్మకున్.

అదియునుం గాక మన్మానసం బనిష్టాశంకి యై యుత్తలంపడియుండెను. కాన నీ వొంటి నేగకుము. శీఘ్రగమనంబునకుం గావలియుండు రక్షకభటవర్గంబును వెంటవెంటఁ దోడ్కొని పొమ్ము. వేగ రమ్ము. సాయంకాలం గరుణ యుంచి యందుబద్ధముగ్ధసరసిజ శోభామనోహరం బగు సీనగుమొగంబు వైళంబ వెండియుం గానిపింపుము.

మదనసేన. అడుగులు తడఁబడ రథముగడవఁ ద్వరితగతిం బోవుచు నిష్క్రాంతయయ్యె.

గౌతముఁడు. వెనువెంటంజనుచు,,

ఓరీ యవన! నావచనంబున నీసుందరి రథారూఢ యయ్యె. ఏను నిచట రథం బారోహించెదను. నీ వతివేగంబున నగరం బెక్క రథ్యంబుల నడుపుము.

యవనభటుఁడు. ఓ బాపనయ్యా! అట్లె యొనర్చెద.

గౌతముఁడు. సంతసంబుతో,,

ఉ. అంబుజపాణి నాకును స్వహస్తగతం బయి పొల్చె నిప్పుడే,
బింబఫలాధరిం గొనుచు భీతిల కెయ్యెడ కైనఁ బోయి యీ,
యంబుదవేణిఁ గూడుచు సుఖాంబుధిఁ దేలుదు. మధ్యమార్గమం,
దం బరిపంథి యడ్డమయి తోఁచకయుండిన మేలె యయ్యెడిన్.
అని యిరువురతో నిష్క్రాంతుండయ్యె.

ఇది కాళిదాసచరిత్రప్రకరణమునందుం

చతుర్థాంకము సంపూర్ణము.

శ్రీరాధాకృష్ణపరబ్రహ్మణేనమః.

శ్రీరస్తు.

---

శ్రీరస్తు.

# కాళిదాసచరిత్రప్రకరణము.

---

## పంచమాంకము.

విద్యగుప్తుండు ప్రవేశించుచున్నాఁడు.

విద్యగుప్తుఁడు. ఔర! మదనసేనయం గలసౌందర్యంబు లోకంబున నుండుపుష్పాబోడుల కెవ్వారలకేని యుండ దని యనుకొనియెదను.

ఉ. అవనజాక్షి ముద్దుమొగ మక్షిపథంబునఁ దోఁచుటాదిగా,
భావిత మైనశీతకరపార్వణబింబము నింపు గాదు. నా,
భావము దానిచంచలతరాంచలలోచనము ల్గనంగ ని,
ద్భావధిఁ గాంచ దుత్పలనిసర్గవిలాసము లాత్మ మెచ్చఁగన్.

మఱియును.

ఉ. దానిబోము ల్గనుంగొనిన దర్పకచాప మదెంత కాను పో,
దానికురు ల్పయోదములతండముల న్నిరసింపఁ జాలు న,
ద్దానియొడల్ కఠోరశిఖితప్తసువర్ణమనోజ్ఞరేఖయే,
దానికి నీడుగారు సురతామరసాయతనేత్ర లిద్ధరన్.

అదియునుంగాక;

చం. రతి సౌందర్యవిలాససంపదల నారాజీవపత్రాక్షి భా,
రతి విద్యానిచయంబులందు సుమమారంభంబున న్జూడ శ్రీ,
సతి యైశ్వర్యకలావిశేషమున నాచంద్రాస్య తా నాశచీ,
సతి యా దానిని జూడకున్న నిఁక నాజన్మం బధన్యం బగున్.

ఇసీ! ఏమిది! ఏను దానితో విద్యావివాదంబున నోడినాఁడను. మఱియు నయ్యిందువదన పెరవానిం బెండ్లియయ్యె. ఏ నీవిధి నందరానిపండ్ల కఱ్ఱు సాచుచున్నాఁడ. ఇఁక నాకాకన్యారత్నము లభించుననుట ఎక్కడిమాట. కార్తాంతికుండగు విప్రుండు ధనలోభంబున నాకుం బ్రియవచనంబులు చెప్పి యానిశిథినియందు న న్నలయింపఁ జేసెడినో! దానియందుం గలయుత్కంఠార్తివిశేషంబునం జేసి యాబాపనయ్య చెప్పినవచనంబుల నమ్మి యాచిమ్మచీఁకటులం బడి కడు నలయుచుఁ గరగళితం బయిన

రతనంబు నన్వేషించుచాడ్పున వీధులవెంట వెదకుచున్నాఁడను. ఆకన్యకారత్నం బియ్యెడ దొరకునాయని మదికి నెవ్వెఱయుఁ బొడముక గున్నది. విధి యనుకూలం బగునేని యభిమతార్థంబు నన్యద్వీపమునుండి యైనను గొనితెచ్చి కరతలామలకంబుగఁ జేర్పకపోదు. ఇట్టులేకదా! తొలుత నీరాజపుత్రితో విద్యావివాహంబు సేయం గోరి యీయూరికిం జనుదెంచి పురబాహ్యోపవనంబున విడిసియుండి మదనసేనాసందర్శనంబున నిచ్చ వొడమి యున్నవాఁడ నగుటంజేసి యుత్కంఠితం బయినచిత్తంబునకు వించుక వినోదంబు గల్పించుకొనఁ నొంటరినై యీ యారామసీమం జెలువారుచారుతరతరునికరంబుల నిరీక్షించుచు నందుఁ గడుదవ్వులకుం జనినవాఁడ నంతలో నయ్యెడను యదృచ్ఛాసమాగత యయినయీరామణీయకనిధిదర్శనంబు నయనంబుల కలిమికి ఫలంబుగ సమకూరినయది. ఇమ్మహోత్సవంబు లభించినవిధంబున మఱియు నిట్టివి జన్మఫలంబులు సంప్రాప్యంబులు గలుగంబోలును. ప్రాయికంబుగఁ బ్రాహ్మణులపక్కులు కల్లలు గావు. ఎందఱో రాజకుమారులీరాజపుత్రికం గోరి వచ్చినవారలు దానితో వివాదంబున నోటువడి యవమానంబున గోర్చి తమపురంబులకుం జనిరి. ఎవ్విధినైన నీమదనసేనం దోడ్కొని గాని మదీయపురంబుఁద్రోవం బట్టం జన దని యీవిశేషవనిపట్టుపల నాకుం గలుగుటయుఁ దదనుగుణముగ నీనక్షత్రశాస్త్రివేది సెప్పుటయుం జూడ నభిమతార్థసిద్ధి గావచ్చు ననియుం దోఁచుచున్నది.

ససారథికంబగురథంబున నారూఢులై గౌతముఁడును మదనసేనయుం బ్రవేశించిరి.

గౌతముఁడు. ఓ ప్రాణవల్లభా! ఏల నీవీయుదరదంబున శోకపంక సంకుచితాంగివై నిలువంబడి యుండెదవు? వేడ్కమెయి నాయంకతలంబునం గూరుచుండుము.

చం. సరసిజపాణి నీబిగువుఁజన్నుల నన్నను రాగపూరభా,
సురగతిఁ జేర్చి పైకొనవె సుందరి నీనును మోవిపానకం,
బరుదుగఁ గ్రోలకున్న నిఁక నంగము నిల్వదు మన్మథాగ్నిని,
ర్భరతరకీలల న్దగిలి భస్మముగాఁగల దాదరింపుమా.
మదనసేన. శోకంబుతో,,

గురువరా! ఈబుద్ధి మీ కుండం జనదు. ఏను మీకు సుతాసమానను. శిష్యను. మఱియు మీయింట దాస్యంబు సేయంగలకింకరిని. అట్టికార్యంబుల నిరోగించి నన్నుం బావనతరపదవీపరిచ్యుతం గాకయుండునట్లు సేయుఁడు. ఇట్టి తుచ్ఛసుఖంబులు మీసాలపైతేనియ లని మీర లెఱుంగరా! దయయుంచి నన్ను విడిచిపుచ్చుఁడు.

వీర్యగుప్తుఁడు. చెవియొగ్గి విని,,

నా వేఁడుకొనిన దీనాలాపంబు లాలకించి యీ పాంచాలీమానరక్షకుండు వీరిం నిరసింప నేతెంచెనో.

సకరుణముగ,,

ఓదయానిధీ! యీ బ్రహ్మబంధువును బ్రాణంబులు దీయకుము.

వీర్యగుప్తుఁడు. ఆశ్చర్యపడుచు,,

ఓకనకాంగీ! నీ కింతవిప్రియంబు గావించినవాఁ డయ్యును వీనిం జంపవల దంటివి. నీదయారసంబునకు మెచ్చుకొంటిని. నీకొకవరంబీఁ దలంచినాఁడ. ఇట్టిసుగుణ సంపత్తిగలనీయందు నీదుర్భగుం డిట్లు కట్టిఁడియై ప్రవర్తించెం గాన వీనిం బట్టి శిక్షించెదను.

అని కుప్పించి గౌతమునిసిగం బట్టి ధనుర్గుణంబుచేఁ జెడ రెక్కలు విఱిచికట్టి,,

ఓగౌతమా! పూర్వము నే నీరాజకన్యకతో విద్యావివాదంబు సేయం గడంగి నప్పుడు నికృతిమెయి నన్నవమానించి నాకుం బాణిగృహీత గావలసినదీనిం దప్పించి తివిగదా! ఇప్పు డేమి సేయంగలవో చూచెద. ఇది వాగ్వివాదంబు గాదు. వీర్య సారవివాదంబు. నీ విందుం జేయఁగలపని యేమి? ఇంక నిన్ను వధింపవలయు నన్నది భావ్యం బయ్యును బ్రాహ్మణుండ వని యీవనజాక్షి కనికరించి యిట్లు గావింపకు మని ప్రార్థించియుంకు కతంబున నా దారుణవ్యవసాయంబువలన నివృత్తుండ నైతి. ఇదె నిన్ను బంధించితి. ఇఁక నీకు విమోక్షణం బెప్పటికో!

అనిగుద్దులుముచున్నాఁడు.

గౌతముఁడు. ఆత్మగతమున,,

కట్టా! ఏఁజేసిననికృతికిం జేసేత ఫలం బబ్బినయది. అట్టి కాళిదాసానుగ్రహ పాత్రుని కళత్రంబును దొంగిలి తెచ్చుట యూరక పోవునే! వీనికి నే నేమియుఁ బ్రతివచనం బొసంగఁజాల.

అనియూరకున్నాఁడు,,

వీర్యగుప్తుఁడు. మదనసేనం గాంచి,,

ఉ. చంచలనేత్రి నీవికచసారసపత్రవిశాలలోలనే,
త్రాంచలలీలఁ గాంచ మది నాస జనించినవాఁడ నుగ్మలీ,
కుంచితనీలముగ్ధశుభ కుంతలసంతతిసుందరంబుగా,
నంచితరీతిఁ గాంచు భవదాస్యసరోరుహ మెత్తి యీసతోఁగా.

మదనసేన. సాతంకంబుగ, ఆత్మగతమున,,

వీఁడు నన్ను రక్షింపం జనుదెంచెనని యనుకొన్నందుకుఁ గ్రోసి కేలుం గూడని శత్రు వయ్యె. గౌతముఁడు బ్రాహ్మణుఁడు గాన మదీయధనుర్విద్యానుకూలతాదిగుణంబులకు భయంపడుచునతిక్రమింపం జాలక యుండినవాఁడు. ఇతండు నాకు భయంపడు వాఁడు గాఁడు. ఏమిసేయుదు.

ఆశ్వాసంబుతో,,

నామనస్సునకొకసమాధానంబు గలదు ; వీఁడు స్వపుత్రుఁడుండు గాన నల్ప బుద్ధిగను మత్పితంపుంబనులకు బోఁడు. గాంధర్వ ప్రసన్నుఁడు. ఎవ్విధి నైన నితనివలనఁ దప్పించుకొనవచ్చునని కోఁచెడిని ఇప్పటికి సమయోచితముగ బొంకితి ననితఁడు నన్నుఁ దాఁకకుండంజేసికొనియెద. మానభంగంబు గాఁబోవుకాలంబున దానం దప్పించుకొనుటకు బొంకులాడుట దోషంబు గాదని ప్రామాణికవచనంబు గలదు. మఱియు నితఁడు నావచనంబులు వినకపోఁడు. ఎట్లనిన !

కం. వనజాతులయం దాసలు। గనినట్టియు దాగకుండను లగుచుగ లా,
వనజాతులవచనంబుల। గుసు జవదాఁటరు తదీయగుణ ప్రియులై.

మఱియు,,

కం. రసభావజ్ఞులు మదిలో। ససదృశ మగుప్రీతి యున్న సంగనలమనః,
ప్రసవంబులు గౌరవగతు। లోఁబడగ తహతహలగూర యత్నించితురై.

ప్రకాశముగ,,

ఓవీర్యధుర్య! నన్నుం జౌర్యమున నపహరించి తోడ్కొనిపోవుచున్నయావి ప్రునిశిక్షించితివి. ఇఁక నేను నీధనము గాని యితరునిసొత్తు గాను. నాతిసిగ్గు వెల్లువఁ బోనసుభయంబుం గూడ నావశ్యకంబు లేదు మాని. ఈ త్రిభువనంశసంజాతు లగుభూనాథులు తాము చెప్పినమాట మరల్పరు. కాన నిప్పుడు నాయందు సంతసించి కోరిన వరం బొసంగెద నన్నవచనంబు యథార్థంబు గా నాకేఁడిన మార్గం బంగీకరింపుఁడు. అది యొద్ది యంటిరేని. తదవులంబట్టి యే నొక్కవ్రతంబు సేయం బూనుకొనియున్నదానను. అది యొకవత్సరమునకు సమాప్తిం జెందు. అంతదనుక నాయందు మీర లుద్విగులూరం జనదు. ఇదినాకు మీరు కరుణించి యీఁదగువరంబు. ఇది యొసంగిన ప్రతిసమాప్త్యనంతరము భవదభీష్టార్థంబు సెలవిచ్చుకొనంజను.

వీర్యగుప్తుఁడు. సంతసంబుతో,,

ఓ సుందరీవతంసమా! అట్లయగుంగాక. రాజకన్యకం దోడ్తెచ్చినాఁడ ననుయశంబ నారుఁ జాలును.

కం. ఇంటికిని లక్ష్మియై నా। కంటికి దా నమృతవర్తికయుఁ బోలెను పై,
న్నింట ముదంబునఁ దేలఁ గ। గంటికి ఫల మనుచు, నిమ్ము గనుఁగొనుచుంగన్,

ఓసుందరీ ! ఏను మదీయం బగు కరూశదేశమునకు రథముఁదోలుచున్నాఁడను.

అని యరదముఁ దోలుకొనుచు నిష్క్రాంతుండయ్యె.

ఇది కాళిదాసచరిత్రప్రకరణమునందుం

పంచమాంకముసమాప్తము.

శ్రీరాధాకృష్ణపరబ్రహ్మణేనమః.

శ్రీరస్తు.

---

శ్రీరాధాకృష్ణపరబ్రహ్మణేనమః.

# కాళిదాసచరిత్రప్రకరణము.

## షష్ఠాంకము.

---

గుణమాలినియు ధనమాలినియు సంభ్రమంబులోఁ బ్రవేశించిరి.

**గుణమాలిని.** ప్రియసఖి ధనమాలిని! ఏమీ యాపదింత! మనభర్తృదారిక యగుమదనసేనగృహంబున నిశీథసమయంబునందు వైతాళికులు నిద్రమేల్కొలుపు నట్టున్నది. గాఢనిద్రాభియోగహతమతులై యుంచుగ మేల్కొంచి యావైతాళికులు తటి యుండగక యిట్లు గావించిరి గాఁబోలు? పూర్వదినంబునం బరిణయకార్యవ్యాపృతులై యుండుటంజేసి యిట్లు జరిగియుండవచ్చును. ఎట్లయినను మనము వైళంబ రాజపుత్రికడకుం జనవలసినవారము గాదే! భర్తృదారిక యస్మదాగమనంబునకుం బ్రతీక్షించుచుండు. మనకును గతయామినియందు నిదురలేమింజేసి పవలయ్యు నిశీథ మని తోఁచుచున్నదియో! ఎందుకుఁగాని వైళంబ చనవలయు.

అని త్వరితతరంబుగఁ జనుచున్నారు.

ధనమాలిని. శ్రమం బభినయించుచు,,

ప్రియసఖి! గుణమాలినీ! మన మెంతవడి వెత్తిన నుద్యానమునందలిభర్తృదారికయుండుకేళీగృహపుమార్గంబు ముగియకున్నది. మనము భర్తృదారికను బాసి యుంటికిం జనినకార్యం బుచితంబు గాదు. ఇప్పుడె యుంటం దలవాల్చితిమి. అప్పుడె లేచి పరుగెత్తవలసివచ్చె.

గుణమాలిని. ప్రియసఖి! యిట్లు వచ్చునని యెవ్వతెకుఁ దెలియునే!

ముందునకు దృష్టులు నిగుడించి, భయంపడుచు నిలిచి,,

ఓసి! అదె కనుంగొనుము. యమభటుండువోలె నతిభయంకరాకారుం డెవ్వఁడో మరణవేదనకుం బాల్పడి యూర్పులు విడుచుచుఁ గాలుసేతుల నిలకుం దాఁచుచుం బొరలుచున్నాఁడు. సమీపమునకుం జన భయం బగుచున్నది. ఈసంకటరథ్యయందుఁ బోయినంగాని వైళంబ భర్తృదారికకేళీగృహంబునకుం జేరలేము. ఏమిసేయనగును?

ధనమాలిని. ప్రియసఖి! భయంపడినం దీఱునా! భర్తృదారిక మనరాక కెంత తహతహపడుచుండునో! ఏమైనను గానిమ్ము. పోదము రమ్ము! భర్తృదారికకేళీగృహంబుం బాసిపోవుటంజేసి మన మపరాధ్ధల మయియున్నారము. అయ్యెడ నేదేని యొకయప్రియంబు జరిగిన మనకు మాట రాదకే!

గుణమాలిని. ఓసి ! నీ వేమిచెప్పినను నామనంబునకు స్థైర్యంబు గల్గదు.

అని మెల్లన నడుగులిడుచు ముందు రోడలువంచి నిరూపించి చూచి.

ఓసి ! వీఁడు మనభర్తృదారికయం గుఱ్ఱంబెక్కించుకొని యుండుగౌతమునిసహోదరుండు గిరిసారుం డనుయువవీరుండు. గవాక్షప్రదీపశిఖాప్రకాశంబువలన బాగుగఁ దెలియంబడియెడిని. వీనిం గాంచి యీనగరంబునం గలకాంచనాంగు లెల్ల భయంపడుచుండిరి. వీఁడునచ్చుట సంతోషావహం బయ్యె వీఁ డిప్పుడుఁ గఠోరప్రవాహంబున నిలకుం ద్రెళ్లి యుండుటంబట్టి గౌతముఁడు నిర్భీతుఁడయి భర్తృదారిక సహితంబుఁ గావించి మధ్యమార్గంబునఁ దనచేస్తకానిం గోలుపోయి సంకటపడి యున్నవాఁ డను నర్థంబు దోఁచుచున్నది. దీన మనభర్తృదారిక కేదిరాయిడుమ సంప్రాప్తం బయ్యె ననుట నిర్ధారితం బయ్యె. వైళంబ పోయి ప్రియసఖిం జూతము రమ్ము.

అని త్వరితతరంబుగఁ బరిక్రమించుచున్నారు.

గుణమాలిని. పురోభాగంబునకు దృష్టులు వఱపి. నివ్వెఱపడుచు. త్వరతో,,

ఓసీ చూడవే ! మనతలంచుస్థంబు విస్మృతంబు లగునుద్యానద్వారకవాటంబుల చేత నిర్ధారితం బగుచున్నది.

ధనమాలిని. ఓసి యంతియు గాదు. కేళీమందిరరక్షకభటు లెవ్వరును గనంబడరు. దానికవాటంబులును దెఱవంబడియున్నవి. మఱియు నీమందిరంబు విజనం బయిన విధంబునం దోఁచెడిని. ఏమే ! యీకష్టము !

ఉరంబున మోఁదుకొనుచు.

గుణమాలిని. ప్రియసఖి ! నీనుడువుపల్కులు వినినంతన నాయంగంబులు విశ్లథంబు లయినయట్లు కార్యాత్మకంబు లైప్రసరింపకున్నవి. ఏమిసేయంగలానే !

ధనమాలిని. ఎట్లున్నను బోయి చూడవలయుఁగదా! ఇంటం బ్రవేశించిచూతము రా! ఇరువురును మందిరాభ్యంతరంబుం బ్రవేశించుచున్నారు.

గుణమాలిని. కలయనవలోకించి,,

అయ్యయో ! మనభర్తృదారిక గనంబడదే ! కట్టా ! మదనసేనయు; సర్వవిద్యావిశారదయు; శారదాదేవీసమానయు; సకలైశ్వర్యసంపన్నురాలికి; మనప్రియసఖి కిట్టిగతి యాపట్టెను?

ఆకాశము లక్ష్యముచేసి,,

ఓప్రియసఖీ భర్తృదారికా! ఓప్రియసఖీ మదనసేనా! ఓప్రియసఖీ యభినవ మానవలోకశారదా! ఆ! ఎంతపిలిచినను బలుకవేమె?

సశోకముగ,,

ఓసీ! నే నిం కేమి సేయంగలనే! హా ప్రియసఖీ! నిన్నే గతినుండు గాతియం బెట్టెనో! ఏక్రూరకర్మునిచేతం జిక్కుకొంటివో! అక్కటా! నీ వేగతి పట్టితివో! అహా నీవే యిడుమలు పడియెదవో! ఎవ్విధంబునం జిక్కి తెదవో! ఏరీతి నోర్చుకొందువో! ఎవ్వరి నెవ్వరింజేరెదవో! ఏమని విలపించెదవో! ప్రియసఖీ! నీ వెట్టిక్రూరదశావిశేషం బనుభవించెదవో! ప్రియసఖీ! భర్తృదారికా! ఏము నీకుం గష్టము సంప్రాప్తమగుకాల మునను నిక్కపుప్రాణల పైని యిడ బాసిపోతిమిగదే! ఓముగుదా! మమ్ముం బ్రియసఖు లనినమ్మి యుంటివే! ఏము కఠినాత్ముల మై యిట్టిసమయంబున నేకపోతిమిగదే! నీతండ్రి నిన్నొకదినమున నైనం జూడక యుండలేఁడే! ఎల్లియుదయంబున నెవ్వరి మొగంబుం గాంచం బోను. దేవి మమ్ముం గాంచి మదనసేనసుఖం బడిగెనేని యే మని నుడువంగలవార మే! ప్రియసఖీ! ప్రియసఖి జగం బంతయు జీర్ణారణ్యం బయ్యెనే! ప్రియసఖీ! నిన్నిట్టు లచింతితోపనత మయిన యిడుమకుం బాలుచేసి యీగుణమాలిని భూమియందుం దిఁక జీవింపవలయునా! ఓదైవమా! కుటిల! యీతపస్వినికి మూఢునిం బతిఁగాఁజేసిన కో అంత యిట్లుండ నిప్పుడు మొదటికే మోసము దెచ్చితివి. హా! యీ కాళరాత్రి నాకు వేగంబోదుసుమా! వేఁగినదిపో! నే నెవ్వరిమొగం బెట్లు గాంతు. ఓగుణమాలినీ! నీకు భర్తృదారిక ప్రాణనిర్విశేష యనియందురే! ఈమాట కల్లయయ్యెఁగదా! నీవు వాసి పోయినను బ్రాణంబులు పోకున్నయవి.

ప్రియసఖి! మదనసేనా!

హా! యింకేలనే గుణమాలిని బ్రతుకవలె! హా! నీనాయకునిగతి యిట్లయ్యెనోగదే!

అని మూర్ఛపోయి యిలపయిం బడియె

భటుండు ప్రవేశించి,,

ఓసి గుణమాలిని! మనభర్తృదారిక యగుమదనసేనదయితుండైనకళాచంద్రుండు తనప్రాణదయితకుం జెప్పు మని నా కాజ్ఞాపించి పంపినయర్థంబు విని యది రాజపుత్రికకుం జెప్పుము.

ఉ. ముద్దులగుమ్మ నిన్నుఁ గడు మోహముచే విడఁబాయలేక నేఁ,
దద్దయుఁ గుందుచున్నదికిఁ దక్షిణ వచ్చితిఁ దీర్థమాడ నీ,
ప్రొద్దును దీక్షమై యెసఁగ బొల్తిగో వెండియుఁ బత్తు నన్నవో,
కొద్దిగ లేయి యుండు నని కోమలి నిల్చితిఁ దాన మాడఁగన్.

కం. మానిని నే లే ననుచున్,
మానసమున ముదముఁ దక్కి మనికితము పడం,
బూనుకొనఁ బోకుమీ యను,
మానింపను వేగ వచ్చి మన్నింతుఁ జెలీ. అని.

ధనమాలిని. సఖి ! సఖి ! యీరటం బెంగుము మనమదనసేనకు భర్త యయినవాఁడు కళాచంద్రుడఁట. అతఁడు నదీస్నానార్థంబు సని ప్రొద్దు గల దని యుద్యోడన తడసి యుండుకుం దనప్రాణదయిత యూత్తలంపడకుండఁ బ్రణయసందేశంబుం బంపి యున్నవాఁడు. దీనివలనం గళాచంద్రుండు మాధవేషమున వచ్చి తనరూపంబు బయల్పఱచి వైతాళికులవచనంబుల మోసపోయి తనప్రాణవల్లభ యింట నున్న దని యీసందేశ మంపినయర్థంబు సుస్పష్టం బయ్యె. అట్టికళాచంద్రునిం బతిఁ గాఁ బడసి యాసుకుమారాకారునితో సౌఖ్యంబుఁ గూరుటకు లేక యీరాజపుత్రిక యెంత దీనదశం జెందిన యది. కట్టా ! యీతపస్విని కెట్టిచెట్ట యుట్టిపడెనే !

గుణమాలిని. ఆశ్వాసంబుఁగల్పించుకొని.

సఖి! మనప్రియసఖికిం గళాచంద్రుండు బతి యయ్యె నన్నది విన్న నిత్తఱి దరిలేని దుఃఖసాగరంబున మానసంబు మునుంగకున్న ! ఆకళాచంద్రుండు కడుసమర్థుం డనియుఁ గరూశదేశాధీశునిమంత్రికుమారుం డనియు విందుము. మనము వైళంబ చని మదనసేన యిర్యోదం గానంబడనివృత్తాంతంబు నతనికి నివేదింతము.

అని ధనమాలినితో లేచి. భటునింజూచి,,

ఆర్య ! కళాచంద్రుం డుండుచోటికి మమ్ముం గ్రక్కునఁ దోడ్కొని పొమ్ము. రాజకన్యకావృత్తాంతం బతని కెఱింగింపవలయు.

భటుఁడు. ఓసి గుణమాలినీ ధనమాలినులార ! రండు పోద మతని కడకు !

అనివారలం దోడ్కొని నిష్క్రాంతుం డయ్యె.

ప్రవేశకము.

---

కళాచంద్రుండు ప్రవేశించి. శోకంబుతో,

ఉ. మానవతీమణిం దలఁచి మానస ముత్కటదుఃఖసాగరా,
న్మానవిమూర్ఛపూరమున నోలి మునుంగుచునున్న దక్కటా,
యానలినాయతాక్షి కుటిలాలకలాలితముందహాసలు,
త్క్మనవకాంత మామొగము మేలిమితో నిఁకఁ జూడఁ గల్గునే !

ఇది యింక నీమందభాగ్యుని కందరానిదియు యనితలంచెదను. నియతముగ నియతి యీకళాచంద్రునిం గష్టములఁ బెట్టం బూనుకొని యున్నాఁడు.

ఉ. కోరుచునుంటి నేఁ దొలుతఁ గోమలగాత్రను పెండ్లియాటకుం,
గూరిచి నామనోరథము గూఢముగా విధి యిప్డు దెస్తుఁడై,
ఘోరవియోగతాప భర గుంఫిత వేదన పాలుచేసె. న,
న్నారహి నేయ నీనియతి శేమి యొనర్చితినో విరోధముల్.

హా ! దైవంబు తనదుంగలకష్టదాసనై పుణ్యంబు నాయందుం గాన్పించినవాఁడు.

ఉ. ఆనవమోహనాంగిఁ గనినంతన గౌఁగిటఁ జేర్ప లేకనే,
మానినిమాధభావమున క్రమ్మడియుంటి నొకింతకాల మా,
మానిని నాదు మాధిదశ మానిచి యేలోకఁ బూనినంతలో,
చానను నన్నుఁ బాసె విధి సహ్యమె యేరికి నైన నీవ్యథల్.

ఇఁక నీకళాచంద్రుని లోకయాత్ర యెవ్విధిఁ జరుగఁ బోవునో !

ఉ. కంటికి నిద్ర రాదు నృపకన్యకఁ బాసిననాటినుండి నా,
యింటికిఁ బోవఁగా హృదయ మెల్లవిధంబుల సమ్మతింపదు,
త్కుంటకతత్వముం గనుచుఁ గాయము దాపముఁ దాళలేదు న,
న్నంటరిఁ జేసెనే విధి పయోరుహలోచనఁ బాపి క్రేళ్ళిడన్.

ఇంక నీకళాచంద్రుండు భూతలంబునను భారభూతుండు గాని మానితజీవుండు గాఁడు.

ఉ. పాపపునాథునం బిఱుకు ప్రాప్తఫలంబును గోలుపోయి నం,
తాపపరీతమై తనువు దగ్ధతఁ గాంచుచు నున్న దింతియుఁ,
జేపడుజాడ లెవ్వియును జిత్తమున స్ఫురియింప వేమొకో,

ఆశ్వాసంబుఁజేసికొని,,

శ్రీపతిసద్దయామహిమచేత శుభంబులె కల్గు నన్నియున్.

మదనసేనప్రియసఖులు గుణమాలినియుం ధనమాలినియుం నాకడకుం జనుదెంచి రాజకన్యక గానంబడ దని నాకుందెలిపిన దాదిగ.

కం. పాతాళగుహను బడిన । ట్లాతత గాఢాంధతమస మలమినరీతిన్,
భూతోపహతము మాడ్కిన్ । చేతోగతి ప్రుక్కఁ గరము చింతానలమై.

ఏనును నేయుంగలకార్యంబు దోఁచక మదనసేన జననీజనకులం జూడ నొల్లక నా తలిదండ్రులకడకుం బోనిచ్ఛగింపక యాచ్ఛపలాక్షిమణిని దలఁచుచు నానాదేశంబులు దిరిగి ధారానగరంబుఁ జేరితిని. ఈనగరాధిపతి భోజుండు కవులందుల కవ్వారిగ ధనంబు లొసఁగుచున్నవాఁడు. ఇతనిసభాస్థలంబునకుం జేరితి నేని సర్వకాలము కవులతో విద్యావినోదంబునం గాలయాపనము సేయుచుండవచ్చు. ఇట్లయినం బ్రియావిరహవిక్లబం బగుమానసంబునకు వ్యాపారాంతరప్రవణతాబలంబునం గొంత యాప్యాయత గల్గంబోలు.

ఎదుటికి దృష్టులు నిగుడించి. ఆశ్చర్యపడుచు,,

ఔరా ! యీయెదుటం బొడసూపు బాలికావతంసంబు పురహరనయనాగ్నిదగ్ధుండగుమన్మథునికిం గల్పించినసంజీవనౌషధివిశేషసహాంకురంబునాఁ దోఁచుచున్నయది. ఔరా యీసుందరవదనయందం బేమందును ?

చం. నును పవడంపు దీవియయనుంగునిగారపుఁగావిమోవి,
కుందనపుఁజోకాటపుంగొమరు లిక్కులకాలు మెఱుంగుమేను లో,
ఘనవనీలనీరజనిభం బగువాల్గనుదోయి యొప్పనీ,
యనుపమరూప బాలిక భవాంబుధి యిందిర నాఁగఁ బొల్చెడిన్.

ఈనితంబవతీకులాభరణంబుం గాంచినంతన నిది నాకన్నుల కమృతవర్తికయుం బోలె నతులానందంబు సమకూరుచుచున్నది.

మఱియును.

ఉ. చానను బాసి దుఃఖభరసాగరమందు మునుంగుచుండునా,
మానస మీసుమాస్త్రునసమానజయేందిర బాలికామణిన్,
జానుపడంగ నాత్మకథను సంతరణం బనిరొంచి మించి యీ,
మానవతీలలామపయి మక్కువఁ జొక్కుచునున్న దెంతయున్.

కాళిదాసుఁడు. కాంచనమాలకు దగ్గఱి,,

* శ్లో. కా త్వం బాలే,,

వేశ్యాకన్య. వినయంబుతో,,

† శ్లో. కాంచనమాలా!

కాళిదాసుఁడు. ఆత్మగతమున,,

ఔర! యిది దీనికిందగిన పేరు. దీని నిరవద్యం బగు సౌందర్యంబునకు శోభావహంబుగ విద్యయు నుండుట బంగారమున కామోదం బుండుటయు.

ప్రకాశముగ,,

‡ శ్లో. కస్యాః పుత్రీ!

కాంచనమాల. ప్రణయంబుతో,,

§ శ్లో. కంచుకవత్యాః,,

కాళిదాసుఁడు. ఆత్మగతమున,,

కంచుకవతి భోజభూపతి రాణి యగు లీలాదేవికిం బ్రధానసైరంధ్రిపదంబున నుండునది యనియు ననమానరూపగుణగణోపేత యనియు విని యున్నాఁడ. దీనివిన యవివేకాదులు దానియాత్మజాత యనుటకుం దార్కాణ యయియున్నది.

ప్రకాశముగ,,

¶ శ్లో. కిం తే హస్తే,,

కాంచనమాల ముఖవికాసంబుతో,,

$ శ్లో. తాళీపత్రం,,

కాళిదాసుఁడు. ఆత్మగతమున,,

ఔర! దీనిప్రత్యుక్తిమాధుర్యంబు కర మభినందనీయంబై యొప్పుచున్నది.

ప్రకాశముగ,,

---

* టీ. బాలే = ఓపడుచా! త్వం = నీవు, కా = ఎవ్వతెవు?

† టీ. కాంచనమాలా = కాంచనమాలయను దానను.

‡ టీ. కస్యాః = ఎవ్వతెకు, పుత్రీ = కూఁతురవు.

§ టీ. కంచుకవత్యాః = కంచుకవతియను దానికూఁతురను.

¶ టీ. తే = నీయొక్క, హస్తే = చేతి యందుండునది, కిం = ఏమి?

$ టీ. తాళీపత్రం = నాచేతనుండునది తాటాకు.

ఈసుందరాకారునిసఖులనలన నానినంబు లగ్నమగుచుత్తం బగుచున్నది.

ఈతనిసొగసు నందె నోప. చెలిని సౌందర్యమునను గిరిగదా.

అని సఖులమాటలనుచుం జనుట నెళ్ళినంబునను నిపాత్రంత గాద్యా.

సఖులు. ఒండొరులతో,,

ఏమే యీచిత్రము? ఈకవిచంద్రుండు మనసఖి నభినవయౌవనారంభంబు గలిగిన నెట్లుండునో యని యావిశేషంబుం గనుంగొనం దలంచుచు నదనురూపంబులగు వచనంబులు పల్కినవి ముగిసినతోడన మనప్రియసఖి నవోఢయైనను యనుగుమ రతీదేవివిధంబునం బొలుపారుచున్నయది. ఇట్టిమాహాత్మ్యంబు గలవాఁడు కవిచంద్రుండ యని వింటిమి. అతండే యాద్యోతని మనకాంచనమాలభాగ్యంబు పండినయదియా.

నేపథ్యంబునందుసికింజూచి,,

ఓసి! ప్రియసఖి! కాంచనమాలా! ఏలనే యిట్లు సిగ్గుపడియెదవు? ఎప్పటికైన నిట్లు గావలసినదాన వేగదా! అమ్మహాతకునిం దిప్పుడే నమస్కరించి యిమ్మహాపురుషాభినందనీయుం బగుటకు మహామోదంబు సంధించు నిట్టి మేలు నమస్కరించి నయీమహాకవికిం గృతజ్ఞతాసంసూచనం బొనర్పక మామాటలనుకుం జనుట పాడియే. అట్లుపోవం జనదు. ఇతనివీడ్కొని యిటునే జననలయుం గాదే! కవికడకు రమ్ము.

అని చేతులు పట్టి తిగుచుచున్నారు.

అభినవయౌవనముతో లజ్జావనతాననయగు కాంచనమాల ప్రవేశించి,,

ఓసి సఖులార యేమతిశయంబుం గాంచిమీరలిట్లు నన్నగడుపెట్టం గడంగితిరి?

సఖులు. ఓసి ప్రియసఖి! నీమైందీఁగె నేమతిశయంబు వొడసూపినది యెఱుంగవా?

కాంచనమాల. తన్నుం గలయం గాంచుకొని. ఆత్మగతమున,,

ఉ. చిత్ర మిదేమి నాశ్రవణసీమలకుం జనె నేత్రపద్మముల్,
గాత్రము వీడసాగెడిని కాంతునిపై మదిఁగోర్కెగ్గె నే,
మాత్రము గానరాదు గదా మధ్యము నూఁగుగ నారు దోఁచెడిన్,
మాత్రన భార మయ్యెఁ గటిమండలి సిగ్గును నిగ్గుదేరెడిన్.

ఇట్టియభినవతారుణ్యకళావిశేషంబు వొడముటకు ఫలంబుగ,,

చం. సుభగవయోవిలాసుఁ డతిశోభనగాత్రుఁ డుదారకాంతి యీ,
యభినవమన్మథుండు నను సాదర మారఁగఁ జెట్టపట్టి వా,

సఖీనా మాహూతిం విరచయతి సౌరభ్య మితి తాం,
రుదంతీం తన్మాతా హసితవదనా చుంబతి ముహుః.

మితియొనర్చుటకు. నశక్యం = సాధ్యముగాదు. ఓ యమ్మా ! నాకన్నులం చెలికత్తె యలచేరలకొలఁదికు మీఁది కెలుకులచేఁ గన్నులు మూయించుకొను వారి తెగలోఁ జేర్చుకొనరని యనుచున్నది. కొందఱు దాఁచుకొనవచ్చునని వారిని విడిచి పెట్టవలసి నవారిని మఱికొందఱు కన్నులు మూయుదురు దాఁగనులసినవారు దాఁగిన వెంటనే కన్నులు తెఱచి వెదకుచుంటయుం గరతలములచేతనే కన్నులు మూయఁబడియున్నదియు లౌకికక్రీడావిశేషపరాయణులకు సుప్రసిద్ధము. కన్నులు పూర్ణముగ మూయనిచో దాఁగి కొనువారు కనఁబడుదురు. మూసినందుం బ్రయోజనముండదు. దీని కన్నులు చేరల కెక్కువయి యున్నవి కానఁ గన్నులు మూయునది తామూయననుచున్నది. నీయంతను జ్యోత్స్నా = శరీరచ్ఛాయాచంద్రిక, గాఢాంధతమసం = దట్టమగునంధకారమును, స్ఫుటయతి = చెదరఁగొట్టుచున్నది. ఇతరులకుం దెలియఁబడకుండ నంధకారావృత మగుస్థలంబున దాఁగి కేని వెన్నెలవంటి శరీరకాంతి యాచోటి యంధకారంబును రూపుమాపి యందఱకు నన్నుం దెలియునట్లు సేయుచున్నది. కాన దాఁగికొనువారు వైళంబ పట్టువడ దానిని నిర్భంజన దని తమ తెగ కవమానము రాకుండం గాఁచికొనుటకుం గడంగి తన్నుం జేర్చుకొనుటకు సమ్మతింపరు. అని యనుచున్నది. కడు దవ్వులకుం జని దాఁగికొనవచ్చునే యన్నచో:— సౌరభ్యం = దేహమునంగలపరిమళము, సఖీనాం = చెలికత్తెలకు, ఆహూతిం=పిలుపును, విరచయతి=చేయుచున్నది. పద్మినిజాతి కాంతకు దేహమందు దివ్యపరిమళ ముండును గాన నీబాలికయు నాజాతిలోఁ జేరినది యగుటంజేసి యట్టి సౌరభము శరీరమం దున్నది. ఇది పోయినమార్గమున సౌరభము గ్రమ్ముకొనుకారణముచేత దానిని నిరూపించి సఖు లక్రమమునం బట్టుకొందురు. ఎంతదవ్వుల కతిగినను మార్గమున మూఁగిన సౌరభము కాంచనమాల యీవైపునకుం జనియె, రండు పట్టుకొనుండు అని తెలుపుచున్నది కానను దాఁగికొను వారలును తమ తెగలోఁ జేర్చుకొనరు అని జననితోఁ జెప్పుచున్నది. ఇతి = అని, రుదంతీం తాం=ఏడుచుచుండునట్టి దానిని, తన్మాతా=దానితల్లి, హసితవదనా=నవ్వుదేఱు మోముగలదై, ముహుః=సారెకు, చుంబతి=ముద్దుకొనుచున్నది. తాను స్త్రీరత్నమగుటంజేసి తనకన్నులు చేరలకెక్కువయి యుంట కడు సౌందర్యవతి యగుటకుం దార్కాణ యని యెఱుంగక ముగుద యగుటంజేసి యిది యాటలాడుటకు వీలపోయెనే యని ఖేదపడుచున్నదే యేమి దీని మౌగ్ధ్యమని తల్లి దానిని దానియొక్క పలుకునకు ముద్దుకొనుచున్నది. ఇట్లే తక్కినవెండు నూహించునది.

అని వచించి యుద్దిష్టకార్యంబు సాధింపం బోతిని. అది కని యీకాంచనమాల తల్లి కడు సంతసించుచు నిట్టిగణికకులావతంసంబునను రాగంబు వదలినం గదా యీ కాంచనమాలరూపరేఖాదులు సార్థంబు లగును. ఇతనియందు ప్రేమానుబంధంబు గలం బుద్ధి తోఁచుచున్నయది. ఇంతదనుక నీ బాలికలోకనీయాకృతిం జూచినవాఁడు రసికవరేం ద్రుండు పల్కుం డగునా! యని చింతం గూరుచుండు నామాగధంబునం గలిగియుండు నాకులభావం బిప్పుడు నివర్తించిన యది. ఇట్టికరణిం గేసరికి తనుకు రూపలావణ్యాది గుణంబులం దద్దయు నుద్దియగు ముగ్ధముగ్ధలకుం గనురాగపూరితాంతరంగులు గాక పోరు ఉండనిమ్ము చింత దీని కఠినవయోవనంబు సంప్రాప్తం బయిన యనంతరము గదా సలుపవలయు. అందు కింకను రెండు మూఁడు సంవత్సరంబులు గడపవలసియున్నవి. ఆకాలమునదుగ జూచుకొందము. అని యిట్లు చెప్పుకొనుచుం దనకూఁతు నూరడించె. ఓకవికులావతంసమా భవదనుగ్రహంబున నాయుతికయును సయితమిప్పుడు సమకూరిన యది. దానికి ఫలంబుగ మాప్రియసఖియుం దనురాగంబుం గైకొని కందుకవతిప్రార్థనం బంగీకరించి తదీయమందిరంబును భవదీయపాదరేణువుల జరిపూతంబు గావింపుము.

కాళిదాసుఁడు. ఓకాంతాతిలకంబులారా! మీపలుకువలనకరంబు సంతసం బందితిని. ఆనాఁడు భువనేశ్వరీపాదవందనాభిగ్రక్షేత్రంబు కేఁగుచున్నవాఁడం గాన బాగుగ నిరూపింప నవకాశపడకపోయెను. ఆబాలికావతంసం బెట్టిదో దాని నిర్ధారణ సేయంజాలక సంశయాక్రాంతమానసుండనై యుంటిని. రూపరేఖావిలాసంబులం బర స్పరసమానభావంబునం బరగు బాలికామణులు రెండయ్యెయుండునుగదా! ఆబాలికావతం సంబె యిది యగుటవలన నాకుం బరమామోదంబు సమకూరె. దీనితల్లి కందుకవతి దీని ముద్దుగొనుచున్నదాతియే నా! దానివినయాదిగుణంబులకుం గడుసంతసించినాఁడ.

నేపథ్యంబునం గలకలంబు గల్గఁగా,,

కాంచనమాలసఖులు తిరిగిచూచి. భయసంభ్రమంబులతో,,

ఓసి ప్రియసఖి కాంచనమాలా! అదె కనుంగొనుము; భోజభూపాలుని స్యాల కుండు కమలాలయాదేవిసహోదరుండు తురగారూఢుండై సమీపమున నుండు పురజనం బులం బ్రహరించుచు మనయుండుకడ కేతెంచుచున్నవాఁడు ఇతఁడు కడుం గ్రూ రుఁడు. రాజవల్లభుండు నగుటం జేసి తాఁ జేసినపనులకుం బనులు సేత యుండ దని గర్వంబుం గొనియుండువాఁడు. మతి కాంగామవశీకృతుండై సుందరీసందోహంబునం దక్రమం బాచరించుచున్నాఁ డని వింటిమి. వీఁడు మనకాంచనమాలం గాంచెనేని సంచలితస్వాంతుండై యవినయంబునకుం గడంగక పోఁడు. ఏమి సేయం జనును అక్కటా! యీదుస్తరంపు దుఃఖసముద్రంబునుండి ప్రియసఖి నెట్లు తప్పింపం జనును. ఏమి సేయుదము?

తురగాధిరూఢుండై రాజస్యాలకుండు ప్రవేశించుచున్నాఁడు.

రాజస్యాలకుఁడు ఆత్మగతమున

ఔరా! ఏమి యీ చిత్రము! ఒకనిమిషకాలమునకు ముం దీ వేశ్యాకన్యక నా కెదురయ్యె. అప్పుడు బాల్యంబు వీడకయుండినయీయండజయాన యిట్టు లొక్కయడుగునన యభినవయౌవనోద్భేదసుభగ యగుట కర మబ్బురంబై యున్నది. అరయ దీనియౌవనాగమ మత్యద్భుతంబు. ఈపుండరీకాక్షికి శైశవంబునన యుండినదానికి జూచుచుండునప్పుడ,,

చం. ఉరమున నుబ్బిమీఱెఁ గుచయుగ్మము కన్నుల దీర్ఘభావముల్,
సరగున నెచ్చెఁ గన్బొమలు సారెకు వక్రము లయ్యె. నంతటన్,
గనెము విచో విలాసము గన్పడె వక్రము లౌచు. మధ్యముల్,
బరమతనుత్వముం గొనియె. భారము లయ్యె నితంబబింబముల్.

అని యనుచుం గాక యీరమణీశిరోమణికి యౌవనప్రవేశోద్భేదంబునను నంగకంబులం గలిగిన గుణవిశేషంబు కరము శ్లాఘనీయంబైన యది బాల్యంబు విడుచుచుండ శైశవపదంబునన తారుణ్యంబు గూడుచుండ నప్పుడు.

ఉ. తనుభావంబు గటీతటంబు దొరఁగం దాఁ గైకొనెన్ స్తనంబులో,
చనముల్ పొందవిముక్తిఁ జంచలగతుల్ శ్లాఘించు చంగీకరిం,
చెను పక్షంబు మనోజదుట్కలయుం గ్రీడావ్యత్తం బూని యా,
వన మీకాంతకు భాంగకంబులగుణవ్రాతంబు వే మార్పఁగన్.

ఇది లీలాదేవిసైరంధ్రి యగుకంచుకి వతికూఁతురు కాంచనమాల. దీని బహుదినంబులుగ రాజకులంబునం దనవారితో మెలఁగుచుండ దానిం గాంచుచు దీని గాఢ జీయకంబున కబ్బదంచు దీనియౌవనాగమసంప్రాప్తిఁ గోరుచుంటిని. నేఁడీ నా భాగ్యబలంబునన కాఁబోలు నిది యుత్తరమణీయావస్థం గాంచినయది బహుకాలంబునకు నామనోరథంబు నీడేరె. దీని నాయింటికిం దోడ్కొనిపోయెద. ఈనగరంబున నానేయంగడంగిన పనుల కడ్డము పెట్ట నెవ్వరికైనం దరంబగునే! ఏ నశ్వంబు డిగి దీని నశ్వారూఢం గావించుకొని తోడ్కొని చనియెద. ఇట్లయిన నితరులు నన్నుం దట్టాయింపం జనుదెంచిరేని నాప్రియులు వారికి హస్తగతగా కయుండునట్లు గాచుకొన నగును. ఇది సామాన్యకన్య యగుటంజేసి యిట్లు సేయుట యంతగా నపరాధంబుగఁ బరిగణింపరు. వైళమ మనోరథంబు నెఱవేర్చుకొనెదను.

తురగంబుడిగ్గి, కాంచనమాలనెత్తి యాశ్వంబుపైఁ గూరుచుండఁ బెట్టును.

సఖులు, హాహాకారంబులు సేయుచు చేదాటు చేసికొని,,

ఓసి! మనముద్దుచిల్కా బావురుబిల్లివాతం బడితివే! యింక నేమిసేయం గలవారము. ఈ క్రూరకర్ముని వలన విడిపింపనినాఁ డీ ముద్దుగుమ్మ యిచటనే విడుచు. ఇందు జంపు సేయం జనదు. ఎగ్గు వాటిల్లు. కాన శైఘ్ర్యంబ చని మనయేలికసాని లీలావతి కీ వృత్తాంతంబు విన్నవించితిమేని యాదేవి కుతూహలపడి కాంచనమాలను గాంచఁ దనకడకు రప్పించుకొనును. అట్లయిన నీ క్రూరునినిరోధంబు మనకభీష్టం బగును. ఒండుపాయం బిందుపయోగింపదు. ఇందు మనలోఁ గొందఱు నిలిచి కన్గొందము.

అనుకొనుచు సఖులలోఁ గొందఱు నిష్క్రమింతురు.

కాంచనమాల, విస్మయసమ్మోహముతో, [illegible] వెసంగొని, వాఁడి మిగులుచూపులఁ గాళిదాసునిం జూచి,,

ఉ. రాతిరి పోవు రేపగడ రాఁగలఁ గ్రౌర్యముఁ దుద్ధరించుటో,
నూతనకాంతి తమ్మిపసి మూల్గొనునవ్వారు కాఁగ యుండు నీ,
భాతిని పంకజోదరసుబద్ధము పట్టుది యాలఁ గాంచ నం,
భూతమదంబు హస్తి యిటు పూనిక నబ్బిని సంహరించెడిన్.

కాళిదాసుండు. ఆత్మగతముగ,,

ఈయింతి కానిడి నవద్యరూపంబున దాను దన కిష్టుండైన ప్రియునిసమాగమంబునకుం గుతూహలపడుచుండఁగా దన యిష్టార్థంబునకు విరోధంబుగ నీకష్టునిచేతం బడవలసివచ్చె నక్కట! యీయమ నీతు ననుభావంబు నాకు సూచితము గావించినయది. ఈదుర్వృత్తుని మదం బడంచి యీనాతి నీసంకటములవలన విముక్తం జేయ నగును.

ప్రకాశముగ,,

ఓ రాజస్యాలక!

* శ్లో. చతురం తురగం పరినర్తయతః పథి పౌరజనా న్పరిమర్దయతః,
నహి తే భుజవీర్యభవో విభవో భగినీభగభాగ్యభవో విభవః.

---

* టీ. పథి = మార్గమునందు, పౌరజనాన్ = అడ్డముగా వచ్చినపురజనులను, పరిమర్దయతః = ప్రహరించుచు, తురగం = గుఱ్ఱమును, చతురం = చాతుర్యముతో, పరినర్తయతః = ఆస్కందితము, ధౌరితకము, వల్గితము మొదలగు నశ్వధారావిశేషంబులతో నడిపించుచు, తే = ఇట్లు ప్రవర్తించుచుండు నీకు, విభవః = ఇట్టివైభవము, భుజవీర్యభవః విభవః = బాహువీర్యముచేత సంపాదించిన విభవము, నహి = కాదు. మఱి:— భగినీ భగ భాగ్యభవః = నీతోడఁబుట్టినదాని భగము చేసిన భాగ్యమువలన నైన, విభవః = వైభవము. నీ విట్లు మార్గమున నడ్డము వచ్చినవారిం బ్రహరించుచు గుఱ్ఱపుస్వారి సేయు వైభవము నీకు నీ బాహువీర్యము వలన నైనది గాదు. మఱి నీతోడం బుట్టినదానియం దనురక్తుండై యుండు భోజునియందుం గల దాక్షిణ్యవిశేషము, అని భావము.

రాజస్యాలకుఁడు. నెవ్వెఱపోయి, కాళిదాసుని గాంచుచు. ఆత్మగతమున,,

కట్టా! వీఁడు నన్ను నిపుణంబుగ నుపాలంభించినవాఁడు. వీఁడు నన్నధిక్షేపించుట విని రథ్యాజనులు స్మేరముఖు లయి నన్నుం గాంచుచు నేగుచున్నారు. ఇంతకంటె నవమానం బేమి గలదు. వీనికి మాఱొడ్డితి నేని యింతకంటె మిక్కుటముగఁ బరిభవంబు గల్గుట నిక్కంబు. కావున వీనితో మాటలాడం జనదు. సులభముగ నీతఁడీయూర నుండు నేని నావంటిగర్వితులగర్వం బడంచుచుండు. వీని నేవిధినైనను దుదముట్టించుట యుక్తంబు. అట్లయినం గాని నాగడంగినకార్యంబు నిరభ్యంతరంబుగఁ జరుగదు. ఏవిధి వీనిం జంపింతును.

చింత నభినయించుచు సోల్లాసముగ,,

ఆ! చింతితార్థంబు నెఱవేఱుచుకొనుటకుఁ ద్రోవ దొఱకినది. ఇట్లు సేసిన వీఁడు బ్రహ్మరక్షోహతుండై చచ్చు. ఇదియ నిర్ధార్యంబు.

హస్తసంజ్ఞచే భటునిం బిలిచెను.

భటుండు ప్రవేశించి,,

ఆర్య! యే మాజ్ఞ యిచ్చెదరు?

రాజస్యాలకుఁడు. భటునికర్ణంబునం గొన్నియర్థంబులు వచించి,,

ఓరి! వైళంబ యని కార్యం బనుష్ఠింపం జేయుము.

భటుఁడు. అయ్యా! మీయానతిం జరిపెదను. ముదలఁ గొనుచున్నాఁడను.

అని నిష్క్రాంతుం డయ్యె.

స్యాలకుఁడు. ఎదుటికి దృష్టులు నిగుడ్చి,

ఇదె లీలావతీపరిచారికలు గొందఱు త్వరితగతిం జనుదెంచుచున్నారు. ఏలకో!

చింతం గూరుచుండెను,,

లీలావతీపరిచారికలు ప్రవేశించి. ఒండొరులతో,,

ఓసి యిదేనటే మనకంచుకపతికూఁతురు కాంచనమాల!

ఏమే యీచిత్రము! ఈనాటియుదయంబున మనము సూచినప్పుడు బాల్యంబున నుండినయది. ఇప్పు డిట్టితారుణ్యంబు నొందుట కరము చిత్రంబు గాదె! దీనిం గాంచుచుండినప్పుడెల్ల కమలాలయాదేవిసహోదరుం డితండు శృంగారసర్వస్వంబుం జెందుచుండువాఁడు. వీఁడు దీనియౌవనాగమమునకుం బ్రతీక్షించుచుండినయర్థంబు రాజకులంబునం గలపరిచారికాజనంబునకెల్ల సువిదితంబ. ఇదియుఁ దగుసమయంబున నితనిచేతికిం దొరికె. లీలావతీసందేశంబుం జెప్పితిమేని యీనాతిని విడువం జాలఁడ యుత్తలంపడు. ఎట్లైనను జెప్పక తప్పునే!

సమీపమునకుం జేరి,,

ఆర్య దేవి యగు లీలావతి తన ప్రధానసైరంధ్రికి తూ.కునకుం గాంచనమాలకు ననముఋంబున వింతగ నభినయయోగ్యనంబు గనిగె నది కని యాశ్చర్యకరంగం గాంచన దలంచి దానిం దోడ్కొని రమ్మని యను విన్నపంబు సంపియున్నది. దేవినియోగం బనుష్ఠింపం జనును.

పాల్గలకుఁడు. చింతతో ఆత్మగతమున,,

కట్టా! చేయులంతిం దొరకినబంగారము చేయిజాఱిపోవుచున్నది. ఏమి సేయనగును. దేవియానతి దురతిక్రమణీయము. తదీయపరిచారికాజనంబునకుం బదా ష్ఠాప్రతిపాలనంబు నప్రతిదీర్ఘ సుగు.

అని చింతించుచుండఁగా,,

కాంచనమాల. ఆత్మగతమున,,

ఇదియు వీనిచేతినుండి తప్పించుకొనుటకుం దగునదయము.

గుల్మమునుండి దిగ్గునలేచి లీలావతీపరిచారికాజనంబులోఁ గలసికొనియె.

నియోగిజనులు కొందఱు ప్రవేశించిరి.

నియోగులు. ఈ రాజపాల్గలకుండు మనకుం జెప్పివంపినరహస్యంబు సేయక మన మర్యాద కేగుదెంచియున్నారము గాదా! వీఁడీపాపం బెవ్వనియందు జేయం దలంచినవాఁడో?

కాళిదాసునిం గాంచి,,

ఎవ్వనియందని విచారింప నేల! యీమనోహరాంగునియందె యని నిశ్చయింపం జను. వీఁడు రూపవంతులం జూచి యోర్వంజాలనివాఁడు. ఈ తేజోవంతునెదుట గాఢాంధతమసంబు సూర్యునెదుటం బోలె రాజపాల్గలకకృతం బగునిక్కృతి యడంగక పోవునా! అయిన నతఁడు నేయు కపటంబు కడు దుస్తరంబు. ఎట్లయ్యెడినో! మన సుం జేసినయాజ్ఞ యనుష్ఠింపక తీరదు గదా!

కాళిదాసునిం దరిసి,,

సవివరా! వందనము! ఈధారానగరంబున భోజభూపాలుండు తననగరంబున నుండువారిం గవిసమస్తులఁ జిల్పివరులం గొని సకలజననయనమనోహరంబుగ నొకభవనంబు వినోదార్థంబుగ నిర్మించి దానిం గ్రొత్తగ నీయూరికిం జనుదెంచినవారలం గని పిలిచికొనిపోయి యాతిథ్యంబు నేయ మమ్ము నియోగించియున్నాఁడు. మేమును ప్రతిసంధ్యము సంచరించుచు సాధువులం గనిపెట్టి తోడ్కొనిచని వారలకు విందొనర్చుచుందుము. నీవు కవికుల వర్యుండవు. నిన్నుం బూజించితిమేని యీధారాపతి యొనరించినపని సార్థకం బగును. మాప్రార్థనం బంగీకరించి మావెనువెంట రమ్ము.

కాంచనమాలయు సఖియలును ఆత్మగతంబున,,

కట్టా! ఈ నియోగిజనులు రాజశ్యాలకునియుగ్రశాసనంబునకు లోనై యీమనోహరాంగుని బ్రహ్మరాక్షసునికి భక్ష్యంబు గావింపం గడంగి యుండెదరు. వీరలు చెప్పిన భవనంబు ప్రాంతరథ్యయం దున్నది. అది నిర్మించిన దాదిగ ననేకులు పాంథులు లేమఱుపాటున నాయింటం బరుండి దానిం గాచియుండు బ్రహ్మరాక్షసునిచేత భక్షింపంబడి మడిసి రని యిది యీయూర నెల్లరకుం దెల్లం బయినయది. భూతాధిష్ఠితం బైన యీమందిరంబునకుం గొనిచని యీశశిచంద్రునిం జంపం బోయెదరు. ఏమి సేయవచ్చు? ఈమన్మథోపమునికిం గలిగినదుస్తరంపుటిడుమ నెట్లు తొలంగింపవచ్చు. కట్టా! యిట్టి యాపదకుం బాల్పఱచి విధాత యీతనియం దకార్యంబు సేయం గడంగె. దైవమా నీకఠోరచరితంబు నేమనంజాలుదును. నీ సేయంగడంగినపనులకుఁ బ్రతివిధానంబు లేక యున్నది. ఓయనాథరక్షకా! శ్రియఃపతీ! నీవ యీశశిం గావంగలవాఁడవు.

కాళిదాసుఁడు. ఓయధికృతులార! మీ ప్రార్థితార్థం బనుష్ఠింపనే సిద్ధపడి యున్నవాఁడ. పోదము రండు. ఆభవనం బనల్పశిల్పనైపుణిసీమం బని విందు. దానిం జూడఁగోరిక నాకును గలదు.

కాంచనమాల. ఆత్మగతమున,,

ఆ! ఏమి సేయుదు? ఈకవివరుండు నియోగిజనులప్రార్థనకు సమ్మతించినవాఁడు. ఈజగన్మంగళరూపనిర్మాణుని మొగంబుం గాంచనినాఁడు నే నీయొడలు దొరంగుట నిక్కంబు. ఈతని కేదేని యిడుమ దొడరిన నాప్రాణంబు లుండవు. ఈ యభినవమోహనాకారునితో నయ్యెడకుం బోవల దని వచింతు నన్న నీరాజశ్యాలకునికిం గోపంబు గల్గు నని తోఁచుచున్నది. ఇంకఁ జేయంగలకార్యం బిది యని నాడెందంబునకుం దోఁపదు. ఈసుకుమారాకారునిం గూడనినాఁడు నాకాయంబు దురంతవేదనానికాయంబై యడంగుట నిక్కంబు.

లీలావతీపరిచారికలు. ఓసి! కాంచనమాల! దేవి నిన్నుం గాంచఁ ద్వరపడియెడిని. పోదము రమ్ము.

అని దానిం దోడ్కొని చనిరి.

కాళిదాసుండు ఆత్మగతమున,,

కాంచనమాల దైవవశమున నీయవినీతునిచేతినుండి విముక్త యయ్యె. లీలావతీదేవికడకుం దోడ్కొనిపోఁబడియెడిని. కానం దదాజ్ఞానుసారిణి యై కంచుకవతి యాత్మతనూజాతయభీష్టార్థంబు నెఱవేర్పక పోదు. క్రమక్రమముగ నిది నాకు లభించు. ఇప్పుడు ప్రియావిరహవిక్లబం బయినమానసంబున నీకాంచనమాలం గాంచి యించుక యాశ్వాసంబుం జెంద నగు నని తలంచుకొనుచుండ విధి యీకాంచనాంగినిసయిత

మెడ బాపుచున్నది. ఇప్పుడు ప్రతికూలపువర్తనంబున నుండువిధి యనుకూలప్రవర్తనంబునకుం గడంగక పోదు. ఈనియోగిజనులు పిలుచుభవనంబునకుం జని యందు జరుగు కార్యంబులచేఁ గొంతప్రొద్దుపుచ్చెదను.

కాంచనమాలసఖులు. ఓసి మనప్రియసఖి ! యీకవివల్లభునియం దనురాగంబుం జెందినయదియు. ఇతని కేదేని యప్రియంబు గల్గిన జీవితమున సయితము పరిత్యజింపం గడంగు. ఇప్పు డీకవివరునికిం గలిగిన యాపదయను నితనికి రహస్యంబు సన్నగిందిన చోఁ దప్పించుకొనం గలఁడు. లేనిచో బ్రహ్మరాక్షసుని పాలం బడును. మనలో నెవ్వతె నైనం గవి ననుసరించుకొని యాభవనంబుదనుకం జని యయ్యెడ వేచియుండి తటి దొరకిన నితనికిఁ గపటంబు విన్నవింపవలయు. ఇందు కీమధురవచన యె సరి.

రాజస్యాలకుఁడు. ఆత్మగతమున,,

పోని మ్మీకాంచనమాల ; రాజకులంబునన యుండునది ; నాకుం దొరకకపోవునే ! ఇప్పుడు నాసేయంబూనినకపటంబును గని పిలుచుమూర్ఖ మానసంబునకు సుస్వస్థతం గలిగించుకొనియెద. తగుచితసంవిధానంబు జరుపం బోయెద.

అని నిష్క్రాంతుండయ్యె.

కాళిదాసుఁడు.

చం. ప్రియను దలంచి మానసము పెక్కుతెఱంగులఁ గుందసాగె నా,
నియతికి నాత్మలో నిపుడు నెమ్మి యొకించుక యేని గల్గ దా,
శ్రీయ మొకప్పైన లేక మది సంతతదుఃఖము నాయనున్న దిం,
తయు వనజాయతాక్షునికృతం బడలం బనిలేదు దీనికిన్.

కం. వనజాక్షునిదయ గల్గిన । ఘనతరదుఃఖాంబునిధిని గాల్వయుఁ బోలెన్,
జనులు దరింతురు నా కతఁ। డనఘుఁడు శరణంబు గాక యన్యుఁడు గలఁడే.

ఇప్పుడు రాజనియోగిజనంబులతోఁ జని చిత్రసీమం బనుపేరం బరగుభవనోత్తమంబుం గనుంగొనుచు రాత్రి పుచ్చెదను.

అని నియోగిజనంబులతో నిష్క్రాంతుండయ్యె.

కాంచనమాలసఖులు. ఈమధురవచన కవివెంట నరుగుంగాక. మనమందఱమును గృహంబులకుం బోవుదము.

అని యందఱు నిష్క్రాంతలైరి.

ఇది కాళిదాసచరిత్రప్రకరణమునందుం

షష్ఠాంకము ముగిసెను.

శ్రీ ర స్తు.

శ్రీః.

# కాళిదాసచరిత్ర ప్రకరణము.

## సప్తమాంకము.

---

భోజభూపతియు లీలాదేవియుం బ్రవేశించుచున్నారు.

భోజుఁడు. దేవీ! నీ విప్పుడు వింత యైన లేనగవుతోఁ గనుపట్టుచున్నావు. దీనిం గాంచ నీముఖసారసంబువలన నేఁ గ్రోలం దగు శ్రవణామృతం బొందు గల దని తోఁచుచున్నది. అట్టి దేదేని యుండిన వీనులకు విం దొనర్పుము.

లీలాదేవి. స్మితము గావించుచు,,

ఆర్యపుత్ర! భవదీయం బగు వదనారవిందంబు మందహాససుందరం బై యొప్పునది యిప్పు డీషత్సంశయాకులం బగుచుండుటం గాంచిన మీరు నన్నే దేనో [illegible] బడుగం దలంచినట్లు సూచితం బగుచున్నది.

భోజుఁడు. దేవీ! నీతర్కం బుపపన్నంబ. కొన్నిదినంబులనుండి యొకవింత కాంత నానయనపథంబునం దగులుచున్నది. అది మనసైరంధ్రి యగుకంచుకపతికూఁతురు కాంచనమాల యని యూహింపం దగియున్నను దానికూఁతురు శైశవంబునన యుండునది గాన నాసంభావన యసంభావితం బై కనంబడుచున్నది. ఆ కాంత యెవ్వతెయో యని సంశయించుచున్నవాఁడ.

లీలావతి. లేనగవుతో,,

ఆర్యపుత్ర! ఆవింతకాంత యెవ్వతె యని మీ రనుకొంటిరి.

భోజుఁడు. దేవి! అది కాంచనమాలయే యని నిర్ణయించుకొనియుండెదను. కాంచనమాల యయ్యె నేని యిప్పుడ తరుణియయి చూపట్టం గతంబు లేదు. కాన సంశయించెదను.

లీలావతి. ఆర్యపుత్ర! మీ రొనరించిననిశ్చయంబు యథార్థంబ.

భోజుఁడు. వైచిత్ర్యంబుతో,,

దేవి! యేమి యిది! అది కాంచనమాలయేనా! అట్లైన దాని కభినవయౌవనాగమం బకాలంబున నెట్లయ్యె?

లీలావతి. ఆర్యపుత్ర! ఒకమహాకవివలన నది లభించినయది.

భోజుఁడు. ఆశ్చర్యంబుతో,,

దేవి! యిది కడు చిత్రమై యున్నది. అట్టిమహాత్ముం డెవఁడైనను
డెవ్వండో! ఈకాలంబునను యోగాభ్యాసమునఁ గలుగునట్లు వచించిన యామహాత్ముని
వాక్సిద్ధి నేమందును! ఈవృత్తాంతంబును సాకల్యముగఁ జెప్పుము.

లీలావతి. ఆర్యపుత్ర! విన్నవింతు వినుండు.

అని రాజుచెవిలోఁ జెప్పెను.

భోజుఁడు. దేవీ! నీచెప్పినకవి కాళిదాసుండై యుండవలెను! కానివాఁడిట్టి
వచనంబుల నర్థంబను వర్తింపుట యెట్లుపడిది? అట్టి వాక్సిద్ధి యాతనికే కలదనియె
తలంగుదును.

ఇతనిం గాంచం గోరి బహుదినములుగ నేఁ బ్రయత్నించుచున్నవాఁడ.
ట్లుండ నేను నామంత్రి యగునార్యబుద్ధిసాగరుండు నొకనాఁడు వేషాంతరధారులమై
నగరపరిశోధనార్థంబు సంచరింపుచు నొక దొమ్మరిమాంసాపణముదగ్గఱ సన్యాసి నిలువం
డి పలలము బేరమాడుచుండుటం గాంచి ఆ! మనవగరమందు నిట్టియధర్మము జరుగు
చున్నదిగదా! యని యాశ్చర్యపడుచు నతనివృత్తాంతం బారయం గోరి యాతనిం జేరి
నే ని ట్లంటిని.

* శ్లో. భిక్షో మాంసనిషేవణం కిముచితం,,

అని యడుగఁగా నతఁ డి ట్లనియె.

† శ్లో. కిం తేన మద్యంవినా,,

అనఁగా నితం డింతటితో నుండువాఁడు గాఁడు; మద్యంబునను బ్రియంబు
గలిగియున్నాఁడు. ఆ! ఏమి వీని సన్యాసప్రకార మని యనుకొని యి ట్లంటిని.

‡ శ్లో. మద్యం చాపి తవ ప్రియం,,

అనఁగా నతఁడు,,

§ శ్లో. ప్రియమహో వారాంగనాభి స్సహ,,

---

* భిక్షో = ఓరిసన్యాసీ! మాంసనిషేవణం = మాంసభోజనము, ఉచితంకిం =
యుక్తమాయేమి?

† మద్యంవినా = మద్యములేక, తేన = ఆమాంసముచేత, కిం = ఏమియుపయోగము.

‡ తవ = నీకు, మద్యంచాపి = మద్యముసహితము. ప్రియం = ప్రియమా!

§ వారాంగనాభిస్సహ = వారాంగనలు త్రాగఁగా శేషించినది వారలతోఁ
కలసిత్రాగుట, ప్రియమహో = ప్రియము:

అనెను. అది విని నేను మనంబున మద్యపాననిరతునికి వారాంగనారతియు నత్యంతప్రియంబు గాకపోవునే యని తలంచుచునట్టి వారాంగనారతి ధనాఢ్యునికె కాని భిక్షుకునికెట్లు దొరకంబోవు నని శంకించుచు నాతనితో,,

* శ్లో. వారస్త్రీరతయే కుతస్తవ ధనం,,

అని యడిగితిని. అందు కాతఁడు,

† శ్లో. ద్యూతేన చౌర్యేణవా !

అనఁగా నే నతనిపల్కులకుఁ గడు నివ్వెఱవోయి మనంబున నితని కీభిక్షువేషం బెక్కడ? చౌర్యద్యూత వారాంగనాసంగమమద్యపానమాంసభక్షణంబు లెక్కడ? బ్రహ్మవిద్యాపరిశ్రమమున కుచితం బగునీపావనాశ్రయమును స్వీకరించుట కిదియా ఫలంబనుకొని యి ట్లంటిని.

‡ శ్లో. చౌర్యద్యూతపరిజ్ఞతాఽస్తి భవతః,,

అని యడుగఁగా నతఁ డి ట్లనియె.

§ శ్లో. భ్రష్టస్య కావా గతిః,,

అనఁగా విని యది యేను మున్ను సన్యాసి యొకండు కాంతాసక్తుండై యాశ్రమాచారభ్రష్టతం జెంది బ్రహ్మానందాధిరాజ్యపదవీచ్యుతియు సంసారసుఖసంప్రాప్తివిరహంబును గాంచి రెంటికిం జెడినరేవడయై యుండ నదిసూచి తద్వృత్తాంతం బరయం గోరి కవిసంఘంబున కీసమస్య యొసంగినాఁడ. అసమస్యార్థంబును నాకుం జెప్పి మనకవులలో నెవ్వఁడేని యిట్లు వేషాంతరధారియై వచ్చి నా కీయర్థం బెఱిగించెనో! యని సంశయించుచు నాయర్థం బార్యబుద్ధిసాగరునితోఁ జెప్పఁగా నతఁడు రాజా నీ

---

* వారస్త్రీరతయే = వారకామినులతో రతిసేయుటకు, తవ = నీకు, ధనం = ద్రవ్యము, కుతః = ఎట్లుదొరకును ?

† ద్యూతేన = మధ్యాహ్నమందు జూదమాడుటచేతను, చౌర్యేణవా = రాత్రి వేళల దొంగతనము చేయుటచేతను సంపాదించెదను.

‡ భవతః = నీకు, చౌర్యద్యూతపరిజ్ఞతా = దొంగిలించుటయందును, జూదమాడుట యందును, పరిజ్ఞానము, అస్తి = కలదా !

§ భ్రష్టస్య = వర్ణాశ్రమాచారమువలనం జెడినవానికి, గతిః = గతి, కావా = ఏది. వర్ణాశ్రమాచారపరిభ్రష్టుని నెవ్వరు నాదరింపరు గాన నట్టివాని కీరీతి గాక లోకయాత్ర జరుపుకొనుటకు గతి యే మున్నది ?

మధురవచన. దేవి ! కవికులచంద్రుం డగు నామహనీయునిమహిమ యింతింతని చెప్పం దరంబు గాదు. స్యాలకచోదితు లయి నియోగిజను లాకవిని సత్కృతి మెయిం జంపంగడంగి వినయంబుఁ గాన్పించుచు నాబ్రహ్మరాక్షసాధిష్ఠితం బైననూతనమందిరంబునకుం గొనిపోయి యాతిథ్యం బొసంగి మృష్టాన్నపానాదులఁ బరితృప్తునిం గావించి మహాశ్శయనంబునం బరుండం జెప్పి చనిరి. ఏను నాకవి పరుండినశయనంబుసమీపంబున స్తంభాంతర్హితనై యామందిరంబులోని నితరుల కెఱుకపడకుండం గవి వృత్తం బరయం గోరి నాప్రాణంబు లాకవివరుండు గాపం గలవాఁ డనుస్థైర్యంబుతో నుంటిని. అట్లుండం దొలిజామున,

ఉ. జుంజురుపల్లవెంట్రుకలు జొల్లు దొరంగెడునల్లసృక్కముం,
యంజనశైల మట్లు నలు పారుమహోన్నత దేహకాయముం,
గుంజరదంతకుంతసమఘోరతరాకృతి దీర్ఘదంష్ట్రికల్,
పంజులఁ బోలుకన్నులకుభస్థితి నొప్పెడురక్కసుం డొగిన్.

కవి యుండుచోటికిం జనుదెంచి యోరీ ! నేను బ్రహ్మరాక్షసుండను ; ఈ గృహంబుం గాచియున్నాఁడ. నానుడివినసమస్యలకుం దగునుత్తరంబీనివాఁడు నిక్కం జంపుదు. ఇట్టిమందిరంబునం బడవులంబట్టి నాచేత మడిసినవారల లెక్కింపం దరంబు గాదు. నీవునట్లు నాచే భక్షితుండవు గాఁబోయెదవు సుమా ! నాకు నుత్తరంబీఁగలవా ! నుడువుము. అని యిట్లు చెప్పె.

బ్రహ్మరాక్షసుఁడు.

శ్లో. సర్వస్యద్వే,, అనినుడివెను.

భోజుఁడు. ఓదేవి ! యిది పాణినిముని రచించినయష్టాధ్యాయిలోని దెనిమిదవయధ్యాయంబునందలి మొదటిపాదపు మొదటిసూత్రము. ఈవ్యాకరణసూత్రము వీప్సాఽభీక్ష్ణ్య వర్జనాద్యర్థంబులందుం గొన్నిశబ్దములకు శబ్దస్వరూపమునకంతటికిని ద్విరుక్తి గలుగు ననునర్థంబు దోఁపింపం జెప్పంబడినది. దీనికి లౌకికార్థంబు సుయోజితముగావించివచింపవలయు నను నుద్దేశంబుచే సమస్యగా నీఁబడియె. దీని కతం డేమి యుత్తరం బొసంగంగలవాఁడో ! యారయ నగు. మధురవచనా ! అనంతరం బేమయ్యె? వచింపుము.

మధురవచన. మహారాజ ! ఆకవి యారాక్షసు నింపుకొనియుం సరకుసేయక తక్షణమె యిట్లనియె.

కవి. శ్లో. సుమతికుమతీ సంపదాపత్తిహేతూ,, అని.

భోజుఁడు. ఔర ! ఆవ్యాకరణసూత్రమునకు లోకవ్యవహారానుగుణముగ నర్థయోజనంబు గల్పించి తదనురూపముగ సమస్యాపూరణంబు గావించిన యీకవివరునిబుద్ధిచతురత కరము మెచ్చం దగినది. అంత నేమయ్యె ?

మధురవచన. మహారాజ! ఆరాక్షసుండు కవి పఠించినప్రత్యుత్తరంబు విని యిప్పుడేమియుం జెప్పక చని రెండవయామంబున నొడియుం జనుదెంచి యాతనిం జేరి యోరీ! యీసమస్యను సయితము పూర్ణము గావింపు మట్లు సేయనినాఁడు నిన్ను భక్షించెదను. అని యిట్లు సెప్పె.

బ్రహ్మరాక్షసుఁడు. శ్లో. వృద్ధో యూనా,, అని.

భోజుఁడు. ఓసి! ఇదియుం బాణినిసూత్రమే! గోత్రప్రత్యయాంతశబ్దమునకుఁ బ్రాచీనులు వృద్ధసంజ్ఞ వక్కాణించిరి. యువప్రత్యయాంతశబ్దముతో సమాసముం బొందిన గోత్రప్రత్యయాంతశబ్దము శేషించు ననుసూత్రార్థంబు గలయది యేకశేషాధికారమునం దున్నది. దీనికిని లౌకికార్థయోజన మతం డెట్లు గావించెనో! ఇట్టిసమయంబు లంటఁ గదా! కవివరులబుద్ధి ప్రకటితము గావలయు. మధురవచనా! అంతు కాకవి యేమి ప్రత్యుత్తర మొసంగె?

మధురవచన. మహారాజ! ఆకవి బుద్ధివిశేషం బసాధారణంబు. అవధరింపు మారాక్షసునినోట మాట వెడలుడు నప్పుడె యతండు పఠియించె.

కవి. శ్లో. సహాపరిచయా త్త్యజ్యతే కామినీభిః,, అని.

భోజుఁడు. శ్లాఘించుచు,, ఆకాశమునలక్ష్యమొనరించి,,

భళిర! ఓకవీ కవియనుశబ్దంబు నీకే తగును. బాగుగ సెతింగి పల్కితివి. ఓ మధురవచనా! ఆకవివృత్తంబు వినంబడుయుంబయుం గుతూహలం బయ్యెడిని. పఠింపుము.

మధురవచన. మహారాజ! ఆబ్రహ్మరాక్షసుం డది విని మిన్నక చని మూఁడవ యామంబున వెండియుం జనుదెంచి కవింజేరి యీసమస్యను సయితము పూర్ణము గావింపనినాఁడు నిన్నుం దినక పోనని యిట్లనియె.

బ్రహ్మరాక్షసుఁడు. శ్లో. స్త్రీ పుంవచ్చ,, అని.

భోజుఁడు. ఓసి! ఇదియు నచ్చొటిసూత్రమే! గోత్రప్రత్యయాంత మగు స్త్రీవాచకశబ్దము యువప్రత్యయాంతముతో సమాస మగునపుడు శేషించు. అది హేతువుగా నాగోత్రప్రత్యయాంతము పుంలింగశబ్దమువలె నగును. అనుసూత్రార్థంబు గలది. కవి తనబుద్ధికౌశలంబున నెట్లర్థాంతరయోజనంబు చేసెనో తెల్పుము. దీనికిని లౌకికార్థయోజనంబు సుకరంబు గాదు.

మధురవచన. మహారాజ! ఆబ్రహ్మరాక్షసునినోట మాట వెడలుటయ తడవు గాని కవి పఠించుట కొంకించుకయు నాలస్యంబు లేకుండె. అట్లు చెప్పినంతఁ దఁ గవి యిట్లనియె.

కవి. శ్లో. ప్రభవతి యదా తద్ధి గేహం వినష్టం,, అని.

భోజుఁడు. ఓసీ! యిట్లు వ్యాకరణసూత్రమునకు సంగతమగు లౌకికార్థయోజన మొనగల్పించుట కలంతులకగునే! కడుమహనీయుం డనంజను. అంత వారలవృత్తం బెట్లు ముగిసె.

మధురవచన. మహారాజ! అప్పుడు కవిపల్కులువిని యాపాలసుదిండి యేమియు ననక చని నాల్గవజామున వైళంబ సమాదించి కవిం జేరి యోరీ! ప్రస్తుతంబగు సమస్యాత్రయమును పూర్ణము గావించితివి. ఇంకొకటి గలదు. దానికి సయితము సంగతార్థంబుగ వచించితి వేని భవదభీష్టార్థంబు సమకూర్తు. లేనినాఁడు నిన్ను భక్షింతును. అని యిట్లుపక్రమించె.

బ్రహ్మరాక్షసుఁడు. శ్లో. ఏకో గోత్రే,, అని.

భోజుఁడు. ఓసీ! యిదియు నాపాణినిసూత్రమే. అపత్యప్రత్యయములు సెప్పు చోటం జెప్పఁబడినది. గోత్రార్థంబున నపత్యప్రత్యయములు పెక్కులు రావలయు నేని వానికిఁ బదు లొక్కటియే వచ్చు నని దీనియర్థము. దీనికిం గవి వచించిన దేమి?

మధురవచన. అట్లు బ్రహ్మరాక్షసుండు పల్కఁగాఁ గవి మందస్మితసుందరవదనారవిందుఁడై కవి యిట్లనియె.

కవి. శ్లో. * ప్రభవతి పుమాన్ యః కుటుంబం బిభర్తి,, అని.

భోజుఁడు. ఓసీ! యేమి యీకవిచతురత! ఒకయర్థంబునకు మఱియొకటి వేఱు దీయకుండం జెప్పినవాఁడు. ఇట్టి వాగ్వైచిత్ర్యంబు గలకవియందు వ్యాలమునకుం గాక యితరునికి నరహంతకునకైన దయారసంబు గల్గక పోవునే! అనంతర మాబ్రహ్మరాక్షసుండు కవియం దెవ్విధిఁ బ్రవర్తించినవాఁడు?

---

* సర్వస్య ద్వే, ఇత్యాదులకు శ్లోకార్థము.

టీ. సర్వస్య=సమస్తమునకు, సంపదాపత్తిహేతూ = సంపదలకును విపత్తులకును గారణములైనవి, సుమతికుమతీ = మంచిబుద్ధి చెడుబుద్ధులనునవి, ద్వే = రెండు.

యౌవనసహపరిచయాత్=యౌవనముగలవానితోఁ బరిచయముగల్గుటవలన, కామినీభిః=స్త్రీలచేత, వృద్ధః=ముసలివాఁడు, త్యజ్యతే=విడువంబడును.

స్త్రీ=ఆఁడుది, పుంవచ్చ=పురుషునివలె, యదా=ఎప్పుడు, ప్రభవతి=పెత్తనము దీర్చునో! తత్ గేహం=ఆ యిల్లు, వినష్టంహి=చెడిపోయినదే.

గోత్రే=కులమునందు, యః పుమాన్ = ఏపురుషుఁడు, కుటుంబం=కుటుంబమును, బిభర్తి=భరించునో; ఏకః=అట్టివాఁడొక్కరుఁడె, ప్రభవతి=కుటుంబమున సమర్థుఁడగుచున్నాఁడు.

అని చెప్పి బ్రహ్మరాక్షసునిం గాంచి యోభూతనాథ! యీకామిని నిజచరిత్రంబు నటుపుచుం గడు డస్సి శ్రమాతుర యయి నిదుర గూరుచున్నయది. ఇది యెయ్యెడ నీ కుపలబ్ధ యయ్యె? అని యడిగిన నారక్కసుండును గయాశిఖరిపురంబున నొకమనోహరోద్యానంబునందు నాకీపుచ్చెకంటి దొరకినయది. అనినం గవియు నోభూతనాథ కరుణించి యీకాంచనాంగి నంద విడియింపుము. ఆపురాధిపతి మజ్జనకునిచేత సుశిక్షితుం డగుటంజేసి తనవారిం దిట్టపడని కామినులం దన్యాయం బాచరింపఁడు. ఈ యంగనయు నచటం జేరినకతంబున నామనంబు గొంత దనుక నాప్యాయితం బగుచున్నది. అతం డన్యాయ మాచరింపఁడు గాన నిట్టి సౌభాగ్యంబునం దెచ్చుట తగదు. ఎల్లరకు సువిదితంబగునట్లు చెప్పింపం గలను. దీనిం దీనికొని పోమ్ము పూర్వమిది యున్నచోటన యుంచుము. అని ప్రార్థించినంతట నాకాంచనాంగిం గొని రక్కసుండు సనియె. వెండియుం గడువేగిరంబ ప్రవేశించి యారాక్షసుఁడు కవిం గాంచి యోమహాత్మ! నీకు నొండుప్రియంబు సేయం గలను. అద్దానిని వచింపుము. అనినం గవియు రక్కసుం గాంచి యోరక్షోనాథ! నీవు నాయందుఁ గరుణ గలిగి యుంట నిక్కంబేని యీమందిరంబుం బాసి చనుము. ఇదియ నాకుం గావలసినవరంబు. అనిన నట్ల యగుంగాక యని యాబ్రహ్మరాక్షసుండు సనియె.

ఇంతలోఁ దన్మందిరాధికృతులు తలుపులు దెఱచుకొని వచ్చి యాకవి జీవించి యుండుట కచ్చెరు వందుచు నాతనిమాహాత్మ్యంబు వర్ణించుచు నతనికి వందనంబులు సల్పి యిట్లనిరి. ఓయయ్య యింతదనుక నీయింటం బరుండి జీవించినవారు లేరు. నీవొక్కరుండవ బ్రతికితివి. బ్రహ్మరాక్షసునివలనం దప్పించుకొన్నవాఁడవు. ఈగృహంబు భోజభూపతి వినోదార్థంబు గట్టించినది. కట్టిన దాదిగ భూతాధిష్ఠితం బై యుండిన కతంబున నామహీపతి యీగృహంబుం బరదేశాగతుల కాతిథ్యంబు సేయుట కేర్పఱచినవాఁడు. ఏమహాత్మునివలన నైన నీయనిష్టంబు దొలంగునో యని తలపోయుచుండు. ఈబ్రహ్మరాక్షసునిం దోలి రాజుకడ బహుమతులు వడయుం గోరికతో ననేకులు మంత్రశాస్త్రపారంగతులు చనుదెంచి యీభూతంబును బాఱఁదోలం గడంగి వానిచే భక్షితులైరి. నీవు దానిం జయింపక జీవించియుండవు. ఈవృత్తాంతంబు రాజెఱింగెనేని కరము నిను సన్మానించు. అని చెప్పుచుండఁగాఁ గవియు వారల వీడ్కొని యామందిరంబుం బాసి పోయె. నే నామందిరంబుం జొచ్చి యచటి యధికృతులను బరిచారకులును సనినయనంతరము కవితో మాటలాడం దలంచుకొనుచు వారలు సనిన వెంబడిన యాబ్రహ్మరాక్షసుండు రాఁగా ననువు పడక యుండి యింతలో నదియు మరలి పోఁగా నిఁక నీకవికి దీనివలన భయం బుండదని తలంచి వృత్తాంతం బారసి నిగూ

రాజస్యాలకుని కెఱుంగం జెప్పుము. అని వేత్రపతికిం దెల్పి మఱియుం గృతకోరకవనాధికృతునితోఁ జెప్పి యావనము వివిక్తంబు గాఁ జేయింపుము. పొమ్ము. అట్లనుచు నీవృత్తాంతంబుఁ దెల్పి చందురుండు దోఁతెంచుట కించుక ముందె కాంచనమాలానైపథ్యంబుతో నయ్యెడకు రమ్మనుము.

మధురవచన. నప్పుకొనుచు,,

దేవ! దేవరయాజ్ఞానువర్తనంబుం గావించెదను. అని నిష్క్రాంతయయ్యె.

భోజుఁడు. దేవీ! మనము కృతకోరకోపవనమునం బొలుచు దారుపర్వతకంబుపై నుండుచంద్రశాలకుం జేరి యందుండి మాయాకాంచనమాలతో మదీయస్యాలకుండు ప్రవర్తింపంబోవు వేడ్కలు కొన్ని కన్నులపండువుగఁ జూతము. నిగూఢమార్గంబున నయ్యెడకుం బోదము.

లీలావతి. ఆర్యపుత్ర! మీ స్యాలకుని నందఱు నిట్లేఁ బరిహసింతురు. ఇంక నతండు నలువురిలోఁ దలయెత్తం బోఁడు. బంధువగు వాని నిట్లవమానపఱుచుట తగునా!

భోజుఁడు. దేవీ! వానిచే నవమానింపవలసినది లేదు! మఱి తన కువినయంబునన తనకుఁ దాన యవమానితుం డయ్యెడిని. చూడుము; ఆకవివలన చెట్టిదూఱు వడసిన వాఁడు!

లీలావతి. ఆర్యపుత్ర! ఈ వృత్తాంతంబు కమలాలయచెవి కెక్కెనేని దుర్మనాయమానమానస గాదా!

భోజుఁడు. దేవీ! తన సహోదరునిగర్వం బడంగునట్లు కవి వచియించినపద్యంబు విని యాకాంత తన సహోదరునియందు దుర్మనాయమానమానస యయి యుండు. కాని మఱియెవ్వరియందును విరసంబడం బోదు. అదియునుంగాక వానికి గర్వభంగంబు సేయక పోరాదు. కావింపనిచో వీఁడు సాధువుల కిట్టియపకారంబులు సేసి తిట్టులు వడుచుండు. దీన నపకీర్తి నాకును గల్గు. అది యట్లుండనిమ్ము. దారుపర్వతారోహణంబుఁ గావింతము రమ్ము.

భోజలీలావతులు పర్వతారోహణం బభినయించిరి.

భోజుఁడు. దేవీ! ఇదె చంద్రశాలకుం జేరితిమి. ఇందు జాలకాంతర్హితుల మై యుండి వేడ్కలు గనుగొందము.

అని దేవితో జాలకాంతరోపవిష్టుండై కృతకోరకంబువలనికి దృష్టులు నిగుడించి,,

దేవి ! అటుల కనంగోనము. నాసామ్యమున దగుదర్పసారుండు మధురానగర వన్నిన కపటంపువలం దగులుకొని కృతకోరకంబుం బ్రవేశించుచున్నాఁడు. వీఁడు కాంచనమాలాసక్తుండు గావున నద్విరహవేదనాజనితతాపండు తాదిగుణంబులం దగ్గయు మాఱియుండెడిని.

దర్పసారుండు ప్రవేశించి,,

కట్టా ! కవిని సమయింపం జేసినప్రయత్నంబు వమ్మయ్యె !

పోనిమ్ము యత్నంబు ? కాంచనమాలాప్రాప్తికిఁ జేసినప్రయత్నంబులు ఫలోన్ముఖంబులు గా నుండ నది యేమి కారణ మేమి ?

ఉ. కాంచనమాలఁ గాంచి మదిఁ గామశరార్తిఁ గుందు మాపటిన్ గా,
మంచితమిత్రి వేత్రవతి యాత్మహితం బగుమాటఁ జెప్పినన్,
మించినకౌతుకంబునను మీనవిలోచనఁ గూడవచ్చితిన్,
వంచకుఁడైన నాయెడఁ గృపావశతం గనె నేమి భాగ్యమో !

పలువలంకులు నిరూపించి,,

ఔర! వనంబున నీయుపవనంబున జనపక్షిరంబై యున్నది.

క. కృతకోద్యానము విజనము మతిమఱపు బ్రేమమునఁ గూర్చి శుభగతిఁ గన నా
యతనుండు దయఁజూచెను న న్నతులితమోదాద్రిశిఖర మారోహింపన్,
ఏలకో తడవయ్యెఁ గాంచనమాల రాకున్నయది !

కాంచనమాలావేషధారియై యజ్ఞసుండు ప్రవేశించె.

యజ్ఞసుఁడు. ఆత్మగతమున,,

ఏను భోజభూపతినియోగం బనుష్ఠించువాఁడ. కామాతురుండై పలుగతిం బ్రవర్తించునీదర్పసారు నవమానితుం జేసెద. వీఁ డీరసాలపాదపంబుమాటున నుండి కాంచనమాలరాక కెదురు చూచుచున్నాఁడు. నావచ్చినజాడ నెఱుంగఁడు. నాపోలికను తెలుపఁగఁ జేసి త్వరితగతిం బంపెదం. కాన నెఱింగించెదను.

ప్రకాశముగ,,

ప్రియసఖి వేత్రవతీ ! మధురవచన నీతో నీకాంచనమాల కృతకోద్యానవిలోకనోత్సుకతం జెలంగుచున్నది ; దీనిం దోడ్కొనిచని యావనంబుసొంపుఁ గాన్పింపుము ; ఏను దేవికార్యంబునకుఁ జనవలసియున్నది యని చెప్పి నీచేతికి నన్నప్పగించినంతనె నీ వీయుపవనంబునను నన్నొంటి విడిచి పోతివి. ఇదేనటే చెలిమి !

పసిడి యని యారయక పోతివి. ఈయుపవనంబు వివిక్తంబయి యున్నయది గాన సరిపోయె. కానిచో నేమిగతి కావలె? ఇట్టి మోసగత్తెవని యెఱుంగకునే నీతో నేను రానేరాను.

నలువలంకలు దిలకించుచు నట్లభినయించి,,

సంభ్రమముతో,,

ఆ! ఇద్యోడ నన్యపురుషులపోలికపడ యున్నట్లు గానంబడియెడిని. ఏమి సేయవచ్చు! ఏకతంబునం బురుషుం డుండుచోటికి ముగుద యొంటిమైఁ జనుదెంచెనేని దానింగాంచి గరగరికగలమగవాఁ డూరకుండునే.

భోజుఁడు. నవ్వుచు,,

దేవి! అర్జునుండు సేయుకపటంపువగలు సూఁచితివే!

లీలావతి. ప్రాణనాథ! యిట్టియర్థంబులంగూర్చి మీరలె యానతినిచ్చినట్లున్నది. మీకు పీఁదడపగాఁడు గాన సర్వజ్ఞులరగుమీవలన నాకీగము లగునర్థంబుల నెఱింగియుండఁడా.

దర్పసారుఁడు. మాయాకాంచనమాలం గాంచి. సంతసించుచు. ఆత్మగతమున,, వేత్రవతి యొనరించినయుపాయంబు కరము శ్లాఘనీయంబు. కాంచనమాలయుం జేయలఁతిని జిక్కినయది. దీనిని విస్రంభణోపాయంబున వశగతం జేసికొనియెద.

సమీపమునకుం జని,,

ఓవగలాడీ! ఏ నన్యుండను గాను. తపస్సులంబట్టి నీయందాసఁ గాంచుచుండువాఁడను. నన్నుం గాంచి భయంపడఁ బోకుము.

మాయాకాంచనమాల. దర్పసారునిం జూచిన ట్లభినయించుచు. లజ్జావినయసంభ్రమంబులతో మఱియొండుచోటికిం జనియె.

దర్పసారుఁడు. వెంటనంటి చని,,

ఓముద్దులగుమ్మా! నీ వేల నన్నుపేక్షించి చనియెదవు?

ఉ. మారకఠోరశాతసుమమార్గణతాపభరంబు హెచ్చ నీ,
చారుపయోధరస్తబక సంగత చందన పంకలేప మి,
చ్ఛారతిఁ జెందఁ గోరితిని సాంకపగంధిరో నీవు నాపయిన్,
గూరిమిఁ గాంచి నాభవ మకుంఠగతి న్సఫల మొందఁ జేయుమీ.

మాయాకాంచనమాల. తలవాంచుకొనియుండె.

దర్పసారుఁడు. కామావేశంబుతో,,

ఉ. కోమలి రిత్తకోపములు గూడునె యొప్పటికైన నాపయిన్,
గాముని లీలలం బ్రణయగౌరవసమ్యఙ్ముఖలైనకిన్కలం,
వేసులు గాంచబోయెదవు వేడుక నన్నలయించె దింతయే,
సామజయాన మోడి యిఁకఁ జాలును లీలల నేలు గ్రక్కునన్.

అని చుబుకంబుంబట్టి యెత్తి ముద్దుగొనంబోయెను.

మాయాకాంచనమాల. తటాలున వానిచేయిఁ బట్టివేసి,,

గీ. చనునె నీ కిది పెద్దలచాటుఁ బాయ । నూడుమగువలతో దిట్టయిట్లు చిత్తగిస్తను,
దప్పి నడచుట నీకొప్పుతెసముననును । దగినవిధమున నడచుకోఁ దగును నీకు.

దర్పసారుఁడు. ఆత్మగతమున,,

పయింబడియుఁ బడఁతులతో మెండొడ్డం గూడదు. కాన నిప్పుడు బలాత్కరించు పనివలన నివర్తించుకొనుట యుక్తమంబు.

మాయాకాంచనమాలభుజంబు వదలి,,

ఉ. సారమసారముం గననిచానల పొందును గాంచుపంటి నా,
సార మెఱుంగనాతిముఖసారసవీక్షణమేసిఁ జాలుపో!

మాయాకాంచనమాల. అసూయనభినయించుచు,,

ఉ. పూరుషు లంగనామణులబుద్ధు లశుద్ధు లెఱుంగ కాసతోఁ,
జేరిన వారికూటములు చీయనరే సకలాత్ము లెల్లెడన్.

భోజుఁడు దేవి! మనయర్జునుఁడు కాంచనమాలావేషంబు బూనిచి యాదర్ప సారుని వంచించునంచు మించిన వేడుక గలిగింపడే! ఇంతలో గాంచనమాల మధుర వచనచే బోధితయై తనయింటికిం బోయియుండును. ఈదర్పసారుండును వంచితుం డయ్యె. ఇఁక వీరలు నివృత్తు లౌట మంచిది.

దర్పసారుండు. ఆత్మగతమున,,

ఈ కన్యకామణి చేయలంతిం జిక్కియుం దప్పిపోవున ట్లున్నది. ఏమి సేయుదగు?

ప్రకాశముగ,,

కం. కరుణింపుము నాపయి నో । యరవిందదళాక్షి నీదునందు ప్రియమున నా,
శిరముఁ గదియించి మ్రొక్కెద । వరవర్ణిని నన్ను నేలు వాంఛలు మీరన్.

అని మాయాకాంచనమాల యడుగులపయిం బడుచున్నాఁడు.

అర్జునుఁడు. నవ్వుచు,,



శ్రీరస్తు.

# కాళిదాసచరిత్రప్రకరణము.

## అష్టమాంకము.

---

కలాలాప ప్రవేశించి,,

ఏను భోజలీలావతులయాజ్ఞానువర్తినినై మధురవచనయింటికిం జనియెద. గతదినాంతంబున దారుపర్వతకమునుండి దిగివచ్చి రాజును రాణియు నన్నుం జీరి యోసి కలాలాప! దర్పసారుం డర్జునునికపటంబున వంచితుండై యాయయోగు వాఁడు. కాంచనమాల నిర్బంధంబు నివృత్తం బయినది. నీవు మధురవచనకడకుం జని దాని నడుగుము. కాంచనమాల యింటికిం జనినయనంతరము ప్రియసంప్రాప్తి దాని కయ్యెనా! లేదా! ఇది తెలిసికొని రమ్ము. అని యానతి చేసి పంపిరి. ఏనును మధురవచనయింటిదాపునకు వచ్చితిని. అదె నాప్రియసఖి మధురవచనయు నతిత్వరితగతి నెక్కడకో చనం బయనమై వచ్చుచున్నది.

మధురవచన ప్రవేశించి. సంశయంబుతో,,

ఏలకో రేపకడన ప్రియసఖి కాంచనమాల నన్నుం బిలువ పంపినయది. ప్రియసంప్రాప్తివలన సంతసంబు గూరుచుండినయాకాంత లేదేని కొంత యుండునో! లేనిచో నన్నేల రప్పింపఁ బూనినయది ?

ముందును దృష్టులు నిగుడ్చి. వైచిత్ర్యంబుతో,,

రాజాంతఃపురపరిచారిక కలాలాప యిదె నాకడ కేగుదెంచుచున్నయది. ఏదేని కారణంబు లేక యిది రాదు. కాన నారయ నగు. ప్రియసఖి! కలాలాప యంతఃపురపరిచారిక వగునీవు మావంటివారియిండ్లకును రాఁగతంబు మీనులకు వింతై యుండును. ఎఱింగింపుము.

కలాలాప. ప్రియసఖి! అవన్నియు నట్లుండనిమ్ము. కాంచనమాలకుం బ్రియసంప్రాప్తి యయ్యెనా! ఈవృత్తం బారసి రమ్మని భోజలీలావతులు నన్ను నీకడ కంపిరి.

మధురవచన. ప్రియసఖి! లీలావతీదేవికిం గాంచనమాలయందుం గలప్రియంబు కడు నధికంబు; కాన విచారించుకొని రమ్మనినయది. చెప్పెదను వినుము. అర్జునుండు కాంచనమాలావేషంబుం దాలుచుకొని కృతకోరకోద్యానంబునకు నాతోఁ జనుదెంచె.

రాజసాన్యులసని కార్యంబులందు వ్యాపృతులై యుండు కేత్రవతీప్రధానులు వానిం గాంచనమాలయే యని యెంచి త్వరితతరంబుగ నతనికి వృత్తాంతంబు విన్నవించిరి. అందు కేత్రవతికపటంపుం గాంచనమాల ననుసరించె. అది గాంచి యేను దాని వెడబాసి పోయి కాంచనమాలాగ్రహణనియుక్త లగు దాసీకలు తమకార్యంబు ఫలించిన దని యేమఱుపాటున వారివారియిండ్లకుం జనఁగా నతినిగూఢమార్గంబునఁ గాంచనమాలం దోడ్కొని తెచ్చి దాని యింట విడిచితిని. ప్రియసఖి కవిగళం బగుచింతతో విషాదంబు నొందుచు స్నానాదులు నిర్వర్తించుకొని సౌధోపరిదేశంబున నుండి నలువలంకులు దిలకించుచుండె నప్పుడు తత్సమీపపథ్యయం దాకవిపణంబు ననుచుఁ గాంచనమాలం గాంచి యు[illegible]నిరెను.

శ్లో. * ఝటితి ప్రవిశ గేహం మా బహిస్తిష్ఠ బాలే,
గ్రహణసమయవార్తా శ్రూయతే శీతరశ్మేః,
తవ ముఖ మకళంకం వీక్ష్య నూనం స రాహు,
ర్గ్రసతి తవ ముఖేందుం చంద్రబింబం విహాయ.

* టీ. బాలే = ఓపడుచా! ఝటితి = వేగముగ, గేహం = ఇంటియందు, ప్రవిశ = ప్రవేశింపుము. బహిః = వెలుపల, మాతిష్ఠ = ఉండకుము. ఏలయనఁగా:— శీతరశ్మేః = చంద్రునికి, గ్రహణసమయవార్తా = ఉపరాగము సంభవించుసమయ మను వార్త, శ్రూయతే = వినంబడియెడిని. ఈయూరఁ జంద్రగ్రహణము గలుగం బోయెడునని పదంతి వినంబడుచున్నది యని యర్థము. చంద్రోపరాగము గలిగినఁ గలుగ నిమ్ము! అందుకై వెలుపల నుండక యింటిలోపలికి జనవలసిన దేమి యన్ననో:— అట్లు పోనినాఁడు గలిగెడుకష్టము దెల్పుచున్నాఁడు. స రాహుః = ఆచందురుని మ్రింగం గడంగు రాహువు, తవముఖం = నీమొగమును, వీక్ష్య = కని, చంద్రబింబం = చంద్రబింబమును, విహాయ = వదలిపెట్టియే, అకళంకం = కళంకరహితుఁడైన, తవముఖేందుం = నీయొక్క ముఖచంద్రునిని, గ్రసతి = మ్రింగెడిని. నిర్దోష మగువస్తువు దొరికినని సదోషమగువస్తువును గోరరు. కాన నకళంకచంద్రుండై యొప్పునీమొగంబుం గాంచి కళంకి యగుచంద్రుని వదలి రాహువు నీమొగంబును మ్రింగంబోవు. నీమొగంబు కళంకము లేనిచంద్రబింబముపగిది నొప్పుచున్న దని భావము.

ఈ శ్లోకమునకు సరియయిన యాంధ్రపద్యము.

చం. ఘనకచ యింటిలోపలికిఁ గ్రక్కునఁ బొమ్మిఁక బైట నుండఁగా,
జన నుపరాగవేళ యిది చంద్రుని కంచును బౌరు లాడుటల్,
వినఁబడె నీముఖేందువును వేడుక రాహువు గాంచెనేని భా,
మిని యకళంకి మ్రింగుఁ గడిమి న్సకళంకము బాసి ప్రేల్మిడిన్.

ఇట్లు కవి వచియించినపలుకులు విని యాలలనాసికతావిశేషంబునకు మనంబున మెచ్చుకొనుచు వెండియు నాతనిసరసోక్తిసుధారసంబుం గ్రోలం దలంచి యూరకుం డంగా నాకాంచనమాలభావం బెఱింగి యానాకామినీమణి కంచుకము దాల్పక యుం డుట మనంబునం దలంచుకొనుచుం గవిం గాంచి యోకవికులతిలకమా! యిది యింటి లోనికింజని చేయవలసినకార్యం బేమేనిం గలదా! ఆనతిమ్ము అని యడుగంగా నాతండు గాంచనమాలం గాంచి,,

శ్లో. * కనకాంగి కలయ కంచుక మనయో స్స్తనయో ర్జవేన ఘనతరగర్వోః,
పురుహూతదిగ్విభాగా దుదయతి కోకారి రద్య పరిపూర్ణః.

అని చెప్పిన నాతనిసుధామధురంబు లగుచతురోక్తుల కలరుచు నాకాంచనమాల వేగంబ సౌధతలంబు డిగ్గి పరిచారిక యందిచ్చునాగంజపు రైక దొడిగికొని సఖికదంబ కంబు తోడ రాఁ దనగృహబహిర్ద్వారదేశగతుం డైన తనసఖుని యెదుర్కొనం జను దేరనప్పుడు కవివరుండును బ్రణయరసపరిప్లుతంబు లయి మందహాససూచితంబు లగు నుదారకటాక్షవీక్షణంబుల నాకాంచనమాలముఖాంబుజంబుపయి నోలయించిన సిగ్గుపడుచు మాప్రియసఖి తనకేలందమ్మిం బయింటచెఱంగు నెత్తి మోముదామర కడ్డముచేసి కొని సుస్మితంబు సేయ నది గని కవి యిట్లనియె.

శ్లో. † ఉచితం గోపన మనయో స్స్తనయోః కనకాద్రికాంతితస్కరయోః,
అవధీరితవిధుమండలముఖమండలగోపనం కిమితి.

---

* టీ. కనకాంగి = బంగారమువంటి యొడలిచాయగలదానా! ఘనతరగర్వోః = కడుఁగొప్పవియగుఁ అనయో స్స్తనయోః = ఈస్తనములకు, జవేన = వేగముగ, కంచుకం = ఱవికను, కలయ = తొడుగుము. అద్య = ఇప్పుడు, పురుహూతదిగ్విభాగాత్ = తూరుపుదిశయొక్క భాగమునుండి, కోకారిః = జక్కవలకుసూడగుచంద్రుఁడు, పరిపూర్ణః = కడుంబూర్ణుం డై, ఉదయతి = ఉదించెడిని. ఓకాంతా నీయొక్కకుచములు జక్కవ లగుటంజేసి చక్రవాకవైరి చంద్రుం డుదయమగుచోని కుచచక్రవాకంబులు విరియుం గాన వేగముగఁ గంచులికఁ దొడుగు మనుచున్నాఁడు.

ఈ శ్లోకమునకు సరియైన యాంధ్రపద్యము.

కం. కనకాంగి గబ్బిగుబ్బల | మనుపడఁ గంచులిక దొడుగు ముద్దియ యదిగో,
కను కోకవైరి యే తెంచె|ఘనమండలుఁ డగుచుఁ బొడమెఁ గాఁ బ్రాగ్దిశలోన్.

టీ. † కనకాద్రికాంతితస్కరయోః = బంగరుకొండవన్నె లదొంగిలించిన వగుటంజేసి, అనయో స్స్తనయోః = ఈ నీస్తనములకు, గోపనం = దాపటికము, ఉచితం =

కాంచనమాల ప్రవేశించి. దీనత్వముతో,,

నా ప్రియసఖి మధురవచన యింకను రాకున్నది. ఏఁ జెప్పి పంపి తడవయ్యె.

మధురవచన ప్రవేశించి. ప్రియసఖి కాంచనమాలా ! నీకోరినకాంతునిం బడసియుం సంతోషాంబునిధియందుం దేలనివిధంబు నీవిన్ననైనమొగంబు దెలుపుచున్నది. మఱియును.

చం. మలయజపంకలేప మిటు మాయక యున్నదిదేమి చన్నులన్,
గలసినపత్రభంగములు గండములం జెడకున్న వేలని,
స్థుల మగునోష్ఠబింబమునఁ దోరపుమస్తమలంపురాగముం,
గలయక యున్నదేమి కలకంఠిరొ యుక్తివిహారొ నాథుపై.

కాంచనమాల. ప్రియసఖి : యే మనియెదవే! ప్రాణనాథునిమోము గనంబడుటను ముంద ప్రణయకోపమా ! ఎంతలే నీమాటలు.

ఉ. కోప మదేల నాకు మదిఁ గోర్కులు జే కొనసాగకున్న నో,
రూపవతీవతంసమ ! నిజార్థిగఁ జెప్పెద నాయకుండు నం,
తాపపరీతుఁడై వ్యసనతప్తాంతం గడుఁ గుందుచుండఁ గా,
నే పగిది న్సుఖంబుఁ గను నింతి కృపాకలితాంత రాత్మతోన్.

మధురవచన. ప్రియసఖి ప్రణయంబు విశేషించిన సల్కగ్గుట చిల్కలల్లులకం దగునర్థంబు గాన నడిగితిని. ఇట్టికారణము లేనినాఁడు రసాభిజ్ఞశిఖామణి యయ్యు నమరక్తయగు సౌభాగ్యలక్ష్మినవావతారయుండుం బూర్వమనుమోదితగ్గైన దానియందుఁ గ్రీడావిముఖుండై యుండం గలం డెద్దియో !

కాంచనమాల. ప్రియసఖి! నాథుండు నాయం దనురక్తుం డగుట యథార్థంబ. ఇతండు కాంతాంతర సమాసక్తుండై తద్వియోగంబునం గుందుచుండు విధంబు గానం బడియెడి. బలవద్వియోగవ్యథావివశుండు తనయభీష్టాంతరంబులం బాటింపకుండుట తెల్లంబ కదా !

మధురవచన. ప్రియసఖి! ఆ మర్మం బటుండనిమ్ము. గతరాత్రియం దతఁ డెట్లు ప్రవర్తించెనో యెఱింగింపుము.

కాంచనమాల. ప్రియసఖి చెప్పెదను వినుము.

ఉ. ఆరసితోత్తముండు ప్రియ మార సుఖాంబుధి దేలలాడుటల్,
గోరని వస్త్రగ్రాస్యపదయుగంఫిత వేదన తోఁ గ్వశేగ తా,
సారెకు వచ్చు నాడు సును నవ్వుచుఁ జే మది సీసడించుచున్,
వారని బాష్పసంతతి విపన్న సుఖాస్య సుతోడఁ జేరిలన్.

ప్రియాసఖి ! యేమి సేయుదు. ఇంగులము మాలతి తోఁచు ; బది యుదంత మనియెఁ జేసిన శీతోపచారంబులందు,

చం. తనువునఁ జందనం బలఁదఁ దత్క్షణమాత్రన పొగ్గఁ బోలె నా,
తనసుమమాల్యసంతతులు తాపమునం బడినట్లు వాఁడె నే,
మనిమదఁ దాపశోషము లహో యెఱుఁగ నోటిగ గంద ప్రేల్చెడిన్,
ఘనఘన సారశేషము నికామగతి జ్వలియింపఁ బూనెడిన్.

ఇట్టి దురంతసంతాపవేదనావశీకృతస్వాంతుండైనయా మనోహరాంగునికి,

కం. సర్వాలోకైకసమంగళ సాగర్వమైన । తనువు విరహాబ్జపాండిమాధార ముగుచు,
జిక్కె యభినవసౌభాగ్యశేష మయిన । సుందరాకారశేఖతో సంచరించు.

మఱియు నాలోకోత్తరసౌందర్యలక్ష్మీస్వయంవరపతి యగునా ప్రాణనాథుండు నాకడకుం జేరిన దాదిగ.

చం. పులకలు గ్రమ్మ నూగుమెయి పూరితబాష్పము లైనకన్నులన్,
గలితవిమూర్ఛనాతతవికంపిత మై పెలఁగాంచు మానసం,
బలఘుసరోచిశేష మయి యందము మీఱెడు మేను గల్గి యా,
గులపడఁజేసె నామనము ఘోరతరాత్రి మునుంగఁ జేయుచున్,

ఇవ్విధంబున రేయి యంతయుం గడిచినం బ్రభాతశేషంబునను సయితమాధ వ్యచరితుండు.

ఉ. తాపము పల్ప నిచ్చ నపుఁడాల్పఁడు పేముఁ బల్కరింపఁగా,
దీనతతోడఁ జల్క నతిదీర్ఘతరోష్ణతమారుతాస్యుఁడై,
మానని చింతతోడ ననమానవిలాసముఁ బాసి యుండు న,
మ్మానసనీరజాక్షి యెద్ది యెఱుఁగ ? కతం బికఁ డిట్టు లౌటకున్.

మధురవచన. ప్రియాసఖి ! ఇందుకుం గతంబు గలదు. మధుమంతపురాధినేత కూఁతురీతనికిం బ్రాణపయిత. ఏకారణంబుననో దాని నెడఁబాసి యితండు వియోగవ్యథావశ శాంతికరణుండై యుండెడిని. దాని రూపణీయత బనన్యసాధారణము.

బ్రహ్మరక్షస్సు మానీతగ్గు రూపుతోఁబరి మూతనమందిరాంతరంబున నాకంటికిం గనం బడియె. ప్రియసఖి ! లోకంబున నెందఱో సుందరాంగులు గలరు గాని యీసరసవద్య రూపోపేతవంటినాతి యీ భూతలంబున నుండదు. వినుము.

ఉ. ఆ నవమోహనాంగి కమలాలయ యేమొ యనన్ మనస్సు నాసగోఁ,
జానన రూపసంపదల కచ్చెరు వందఁగ వోరు లోకులా,
చానవయోవిలాసముల చారుత నేఁ బొగడంగఁజాల నో,
మానిని దానిఁ బాసి భువి మానవసత్తముఁ డోర్వఁజాలునే.

ఆకాంతం గాంచి యాకవివరుండు దానివిరహవ్యథావివశత్వంబునను నగచి బాష్పకలితుండై భూతనాథునితో వెండియు నిది యెందుండునో యిట్టి దీపం జెప్పు మని ప్రార్థించిన నాబ్రహ్మరాక్షసుం డిట్లు యొసరించె.

కాంచనమాల. ఆ ! ప్రియసఖి అట్టియనురూపనవయౌవనోపేతయం దనురక్తుండు గానకే యితరానురాగంబు తద్విరహవ్యథావలితహృదయుం డగుచితనియుల్లంబున రసభావంబుం జెందక యున్నది.

ఉ. ఆరుచిరాననం గలసినంతట గావి ముదంబుఁ జెందఁడా,
సారవిచారుఁ డీనరసుసఖ్యము జన్మఫలం బదెంతయుం,
చారుముఖీవతంసమ విచారము నేయుము దానిఁ జేర్పఁ గా,
బోరన సత్ప్రయత్నములు పూనిసఁ జేయుట యొప్పిదం బగుం.

ఆరమణీవతంసంబుం బడసినం గాని యీతనిదురవస్థావిశేషంబు నివర్తింపదు. అది నివర్తింపనినాఁడు నాకు నీతనితో సుఖం బనుభవింపం బోలదు. కాన నాకాంతా సమాగమం బీకవివర్యునికిం గలుగం జేయ నగును. ఇందు కను పేదియో యొనుంగను.

మధురవచన. ప్రియసఖి భోజునికిని కవికిని పరస్పరసమావేశం బయినం గాని యీ కార్యంబు సాధితంబు గాదు. ఈవృత్తంబు లీలావతీదేవికి విన్నవించి తన్మూలక ముగ రాజుచెవి కెక్కింపం జనును. భోజభూపతి కవులయెడ గరమనురాగంబు గల వాఁడు. ఈకవివరునిం గాంచం గోరుచుండెడిని. ఈతనిం గనుంగొనినని కరూశదేశ పతికి వర్తమానం బెఱింగించి యీనాతిం దెప్పించి యితని కర్పింపం గలండు. తొలుత నీకథినవతారుణ్యంబు గలుగం జెప్పిన యర్థంబు వినియే యితనిమతిమానసప్రభాసం బునకు నచ్చెరు వొందుచున్నాఁడు. ఇట్టియద్భుతచరితంబులు పెక్కులు కవివరుని యందుం గాన్పింపఁబడె. అవియు నతనిచెవి కెక్కినవి. కవియును రాజసన్నిధానం

బునకుం జను. వీరికిం బరస్పరగాఢమైత్రి గల్గక పోదు. ఇంతకు భువనేశ్వరీపాదప్రణా
మంబు సతతము నేయుచుండు మీరు కార్యంబు సాధింతురు. ఏఁ జని లీలావతికి
వృత్తాంత మెఱింగింతు. నీవు భువనేశ్వరిం గొలుచుచుండుము. ఉద్దిష్టకార్యం బను
కూలింపక పోదు.

ముందునమృష్టాన్నిగుడిచి. నైవేద్యంబుతో,,

ఓకాంచనమాలా! ఇది యేమివింతయౌ. ఆర్యుండుబుద్ధిసాగరుండు తానేనాఁ
డేని యీవంకను మరలనివాఁడు సుస్నాతుండై నూతనాంబరంబులు దాల్చి వైదికశ్రోత్రి
చిత వేషంబుతోఁ బాదచారియై యిచ్చటకే యేఁగుదెంచుచున్నవాఁడు. ఈభోజని
ముఖ్యామాత్యుండిప్పు డిట్లు రాఁగతం బేమొకో! ఇతఁ డెక్కడ కేఁగెడినో.

ససంభ్రమముగ,,

ఎక్కడకో యని యేల? మనయింటికే వచ్చుచున్నాఁడు.

కాంచనమాల. ప్రియసఖి! ఒకనాఁడేని యిట్లు రానివాఁడు కాన యిప్పు డిటు
వచ్చుటకుం గారణము మహాకవిం గనుంగొనవలయు ననుట యౌ కాని యొండు గాదు.
కవియు నింత ప్రొద్దెక్కియు నింకను శయనంబున నిదురగూరువాఁడునుం బోలెఁ బరుం
డియుండెడిని. త్వరితగతి లోనికిం జని బుద్ధిసాగరుని రాక కవికి నివేదింతుఁగాక.

అని మందిరాంతరాళంబునకుఁ జనం గడంగుచున్నది,,

బుద్ధిసాగరుండు ప్రవేశించి. సత్వరముగ,,

ఓకాంచనమాలా! నన్నుం గాంచి నీవు త్వరితగతిం జనుటకుం గారణం బెఱుం
గుదును. కవి యుండుశయనాగారంబునకే నేను వచ్చెద. అతనికిం బరిశ్రమం బొసంగం
జనను.

అని మందిరాంతరప్రవేశ మభినయించుచున్నాఁడు.

శయనస్థుం డయి కాళిదాసుండు ప్రవేశించె.

కాళిదాసుఁడు. శయనంబునం దుపవిష్టుండై.

ఆర్య బుద్ధిసాగర! నీ విచ్యోదకుం జనుదెంచుటకుం గతం బెయ్యది!

బుద్ధిసాగరుఁడు. ఓమహాత్మా! వినుము. మదీయజనని కడు వృద్ధ నీ వీయూ
రికిం జనుదెంచిన దాదిగ నునీ గప్పినపప్పువంటివాఁ డితం డని చెప్పుచు వచ్చినది.
కరము దేవపితృ సమారాధనంబునం దత్పరయై యుండినయది. పతిభక్తిపరాయణ.

ఆయమ నీ ప్రభావంబుం గలతెఱంగున నెఱుంగు. ఆసతి తనప్రాణప్రయాణసమయం బున నన్నుం జీరి యోబుద్ధిసాగర! నేను పరలోకగత నైన యనంతరము నాపుం జేయ వలసినయౌర్ధ్వదైహికక్రియలయందుఁ గళాచంద్రుని నిమంత్రితుం జేసి యతనియందు మనంబున నీసడించుకొనక భోజనం బిడవలయు. అట్లైన నేఁ బరితృప్తిం గాంచి యచ్యుతం బగుపదంబును బితరులయనుగ్రహంబునం బడసెద. ఇదియె నాయిష్టార్థంబు. అని నుడివిన నేనును. మాతృవాక్య మవశ్యానుష్ఠేయంబు గాన నట్ల యొనరించెద నంటిని. నాతల్లియునుం బరలోకగత యయ్యె. తదిష్టార్థంబు నెఱవేర్ప నిన్నుం దోడ్కొని పోవచ్చితిని. ఈదినమున భవదీయపాదకమలరజఃపూతంబై నాయిల్లు సకల సాధు జనసంసేవ్యం బగుం గాత.

కాళిదాసుఁడు. బుద్ధిసాగర! నీనుడివినవచనంబుల నర్థము గలదా! అట్లేఁ జనుదెంచెదను. నిమంత్రణోపాయంబునను బూర్వభావికార్యంబులు సిద్ధపఱచుకొనుము.

బుద్ధిసాగరుఁడు మహాత్మా! అనుగృహీతుఁడ నైతిని.

అని నిష్క్రాంతుం డయ్యె.

కాళిదాసుఁడు. ఓ ప్రాణదయితా! కాంచనమాల! ఏలకో నామానసంబు దుఃఖాకులం బగుచు సంతపించుచున్నది. ఎవ్వరితో నైన మాటలాడ నొల్లను. రాత్రి నిదురలేమింజేసి యించుక శిరోవేదనయు బాధించుచున్నది. సూర్యుండు నడిజామున కెక్కునేని నా నెఱింగింపుము. అప్పుడ లేచి బుద్ధిసాగరునియింటికిం జనవలయు. ఈ శయనాగారంపుందలుపులు మూసికొని పొమ్ము.

కాంచనమాల. ప్రాణనాథ! యట్లయే నిహరింపుఁడు.

అని తలుపులు మూసి నట్లభినయింపం గాళిదాసుండు నిష్క్రాంతుఁడయ్యె.

మధురవచన. ప్రియసఖి నేను దేవిలీలావతి కీవృత్తాంత మెఱింగింపం జనియెదను. నీవు స్నానాదులు నిర్వర్తింపం బొమ్ము.

అని కాంచనమాలతో నిష్క్రాంతయయ్యె.

ఇది కాళిదాసచరిత ప్రకరణమునందు

అష్టమాంకము సంపూర్ణము.

శ్రీరస్తు.

జనుదెంచుటకుం గారణంబు బలవత్తరంబై యుండకపోదు. మఱియుం బూర్ణకుంభంబులు దాలుచుకొని యుండు బ్రాహ్మణులం దోడ్కొనివచ్చుట యేలకో ;

ప్రకాశముగ,,

ఓసి ! రమ్మని చెప్పుము.

కలాలాప. దేవ ! యట్లయగు,

అని నిష్క్రాంతయై బుద్ధిసాగరునితోడను బూర్ణకుంభంబులు దాల్చిన బ్రాహ్మణులతోడను బ్రవేశించి,,

ఆర్య ! అమాత్యసత్తమా ! రాజు మధ్యాహ్నస్నానకాలాపురోవర్తిమండపమున నుండి భవదాగమనంబునకుం బ్రతీక్షించెడిని. ఉపసర్పింపుము. ఏను దేవియానతి సేయంజనియెద.

అని నిష్క్రాంత యయ్యె.

బుద్ధిసాగరుఁడు. భోజునికి సమీపించి,,

ఓరాజా ! మన మీదినమునందు జన్మసాఫల్యంబుం గంటిమి. స్వర్గలోకంబున నుండుమందాకినీపావనతీర్థంబు లివి బ్రాహ్మణులచే సువర్ణఘటంబులందు నింపుకొని తెచ్చియున్నాఁడను. ఇంక దేవికి బ్రాహ్మణసమూహంబులు వేలుగ నాతీర్థంబులు దెచ్చియున్నారు. ఈపావనోదకంబుల నీవును దేవియుం దానమాడి సమస్తకలుషవిముక్తులరగుఁడు. నీకు మధ్యాహ్నస్నానకాలం బతిక్రమింపం బోవు నని త్వరపడుచు నీమహాతిశయంబు నీకుం బ్రాప్తింపఁజేయు నాకార్యంబు నడపినయది నిది సేయం జను నని నిర్ణయించి నీయందుం గలవాత్సల్యంబున నివి దెచ్చితి. అఘమర్షణమంత్రంబులతో నీ విప్రవర్యులు నీ కభిషేకంబు సల్పెదరు. బ్రాహ్మణపుణ్యయువతులు దేవిని దానమాడింతురు.

భోజుఁడు. మహాశ్చర్యంబుతో,,

ఆర్య ! భగీరథునంతటివాఁడు తత్పూర్వపూర్వులును దానును సలిపిన దురత్యయంబగుతపఃఫలంబునను బడసినయీదివ్యగంగాజలంబులు నీకు లభించుట యెట్లు! ఇది కరమాశ్చర్యకరంబై యొప్పెడిని. భవన్మూలకముగ నాకు నీవిశేషంబు సంప్రాప్తంబయ్యె. మనయందే దేవత కనుగ్రహంబు గల్గెనో తెలియదు. కృతార్థుల మయితిమి. నీకుం గలిగినయీమహాతిశయంబును నాకును సంప్రాప్తంబు గావించిన నీవాత్సల్యవిశేషంబునకు నేను నీ కేమి సేయంజాలను.

బుద్ధిసాగరుఁడు. రాజా! సాధుజనులసమాగమంబు గలిగెనేని యదియ జన్మ ఫలంబు. దానం బడయరాని దేదియును లేదు. అట్టిది యబ్బుటం జేసి యీయతిశ యంబు సంప్రాప్తం బయ్యె.

భోజుఁడు. ఆర్య! అట్టిసాధుజనుఁడు లభించె? నిన్నీవిధి ననుగ్రహించిన వాఁడెవ్వఁడు? ఈవృత్తాంతంబు జరిగినవిధం బెట్లు? సర్వంబు వినిపింపుము. కౌతూహలం బయ్యెడిని.

బుద్ధిసాగరుఁడు. రాజా! యిప్పు డీయూర నతిచతురకవితాచాతురీవిభూషి తుండను పేరుగల ద్విజుండు దిరుగుచున్నాఁ డని నీ వెఱుంగుదువు గాదె! నాతల్లి యతని ప్రభావం బెఱింగి వృద్ధ తనయార్ధ వ్రతహితకార్యంబులం దతని నిమంత్రితునిం గావించి భోజనం బిడు మని నాతోం జెప్పి కాలధర్మంబు నొందినయది. ఏను మాతృ వాక్యంబు ననుసరించువాఁడఁ గాన నతని నీదినమున నిమంత్రితుం గావించితిని. మధ్యందిన మున కాంచియు.

చం. నిరుపమ సార సౌరభము నిక్కగమై యలరారు మేనితో,
పరలెడు మేనినున్నసపువన్నెలు చెన్నలరారు నల్వతో,
నరుణితరాధగోష్ఠమున నద్దపునుద్దములంపుఁ గాంతితో,
సరగున వచ్చి స్నానవిధి సల్పకయే కుడువం గడంగినన్.

ఏను మదీయమాతృవచనగౌరవంబునం జేసి యాతనియందు దోషబుద్ధి సలుప కుంటిని గాని యాతనికి సహనిమంత్రితులు విప్రులు తదశుద్ధి కీసడించుకొనుచు నోరి బ్రాహ్మణుండ! స్నానమాడక కుడుచుట యనుచితంబు. అంతియ కాదు. రాత్రియం దెయు వేశ్యాగృహంబున గడపి యావేశ్యాసంభోగచిహ్నంబులను మాపుకొనకయు పాపపుంబోఁడివేషంబుతో నీవైదికకార్యంబునకుం గడంగుట కర మొప్పునిపని. ఇట్టి యనుచితకృత్యంబులు సేయునీతోఁ బొత్తున భుజియించుట మాకుం బాతిత్యహేతు వగు. బుద్ధిసాగరునిం గాంచి యీయూర్చ్రోనవలసివచ్చె. అని పరుషవచనంబు లాడిన నాకవికులాగ్రగణ్యుండు విని యోవిప్రవర్యులారా! యిప్పు డేఁ జేయం దగుపని యేమిరో! ఆనతిండు. అనిన నాబ్రాహ్మణులు ఓవిప్ర! నీవు తొలుతఁ దీర్థోదకంబులఁ స్నాన మాడవలయు; ననంతరము ధౌతాంబరంబులు ధరించి వైదికకార్యంబున కుపయోగింపం జను అని చెప్పిన విని యామహాత్ముండు నవ్వి యోవిప్రవర్యులారా! నన్నుం దీర్థో దకంబులం దానమాడు మంటిరి. అట్టియుదకంబులం గానక యున్నాఁడ. పర్యుషి తంబు లైనయుదకంబులు విశుద్ధంబులు గానివి పరుల నెట్లు విశుద్ధులం జేయం జాలును?

భూమియం దుండు నేయుదకంబులు గాని పర్యుషితంబులు గానివి గలవా! యని యడుగ నావిప్రు లొకరిమొగంబొకరు చూచుకొనుచు బదులు సెప్పంజాలక యూరక యుండిరి. అప్పుడు నే నావివరమునితో నోమహాత్మ యీ యపర్యుషితంబు లగుతీర్థోదకంబుల రప్పింపంగలవాఁడ వని తోఁచుచున్నది. కానిచో నిట్లు నీవు వీరి నడుగవు. నన్నుం గాంచి నాయందుం గనికరించి నాతల్లి నీయందుంచినభక్తిగౌరవంబులం బరికించి యట్టి యుదకంబులు రప్పించి యెల్లరం బావనులం జేయుము. అతులితం బగుమహోపకారంబుం గాంచుము. అని ప్రార్థించిన నామహాకవి సంతసిల్లి యించుక ధ్యాననిమీలితనేత్రుండై యుండి కన్నులు దెఱచి యిట్లనియె.

* శ్లో. ఆదౌ వాదిపితామహస్య నియమవ్యాపారపాత్రే జలం,
పశ్చాత్పన్నగశాయినో భగవతః పాదోదకం పావనం,
భూయశ్శంభుజటావిభూషణమణి ర్జహ్నో ర్మహర్షే రియం,
కన్యా కల్మషనాశనీ భగవతీ భాగీరథీ దృశ్యతాం.

---

* టీ. ఆదౌ = తొలుత, ఆదిపితామహస్య = ఆద్యుఁడగు బ్రహ్మయొక్క, నియమవ్యాపారపాత్రే=నియమానుష్ఠానమునకుఁగా నుంచుకొనియుండు పాత్రమునందు, జలం = ఉదకము. పశ్చాత్ = పిమ్మట, భగవతః = భగవచ్ఛబ్దవాచ్యుఁడైన, పన్నగశాయినః= శేషశాయియగునారాయణుని, పావనం=పరిశుద్ధమగు, పాదోదకం = పాదతీర్థము. భూయః = మఱియు, శంభుజటావిభూషణమణిః = మహాదేవునిజడల గలంకారరత్నము. జహ్నోర్మహర్షేః = జహ్నువనుమహామునికి, కన్యా= కూఁతురు. అయినః—భగవతీ భాగరథీ = భగవతియగు దేవగంగ, ఇయం = ఇదెతోఁతెంచెడిని. దృశ్యతాం = చూడనగుఁగాత. ఇచటభాగీరథీశబ్దమునను భగీరథపథప్రవృత్త యయినగంగ యర్థమయినను మందాకిని యుపలక్షణము.

తొలుత గోలోకమున మహాదేవునిగీతంబు విని ద్రవీభూతు లయినశ్రీరాధాకృష్ణుల శరీరములవలననిస్సృతము లగుజలములకధిదేవత యయియుష్పాముగంగాదేవి యుద్భవించె. అదియాకృష్ణునిం గామించినందున రాధ కుపితయై తజ్జలాత్మకస్వరూపంబును ద్రావింగి రూపు మాపం గడంగుడు నది యెఱింగి గంగ తనస్వరూపముల నుపసంహృతములఁ గావించుకొని రాధానాథునిచరణకమలములందు లీన యయ్యె. జలతత్వంబుతో సంబంధంబువాయుడు బ్రాహ్మండంబు వెట్ల సాగిన బ్రహ్మదు లాయనర్థంబు వారించు

